ఇందులో;

కళ్యాణి

ముక్కాలు పీట

మర్యాదస్తునికో కథ

దోషగుణం

# కళ్యాణి

రాయపేటలో విన్నాడు ఆ రికార్డు ఏదో హోటల్లోంచి "నీదు చరణములేగతి" అని కళ్యాణి పాడిన రికార్డు. రెండేళ్ళై వుంటుంది కళ్యాణిని రేడియోలో విని. ఆమె ప్రోగ్రాం వున్నప్పుడల్లా మద్రాసు రేడియోకి రాశాడు ఆమె పాటని మెచ్చుకుంటూ. ఆమెకి అరగంట ప్రోగ్రాములేగాని అంతకన్న ఎక్కువ ఎప్పుడూ ఇచ్చేవారు కారు. మరి తాను అడగగా అడగగా అంతకన్న ఎక్కువసేపు పాడడానికి ఆమె నిరాకరిస్తోందని ప్రత్యుత్తరం చెప్పారు. ఆమెకి వుత్తరం రాయాలని తాను ఆమె చిరునామా అడిగితే చెప్పడానికి వీల్లేదన్నారు. క్రమంగా ఆమె పాట రేడియోలో వినపడడం మానేసింది. తాను ఎన్నో వుత్తరాలు రాయగా, ఆమె ఎక్కడున్నదీ తమకే తెలియదన్నారు రేడియోవారు. ఆమెపాట తనకే ఇష్టం. తనకి తెలిసినవారిలో ఆమెని ప్రత్యేకంగా గమనించినవారు లేరు. మిత్రులకి వినిపించినా, వాళ్ళు 'బాగానేవుంది' అనేవాళ్లు. సంగీతపాటవులు అసలే వొప్పుకోలేదు. ఈనాడు మళ్ళీ విన్నాడు ఆమె రికార్డుని. ఆమె జ్ఞాపకం వొచ్చింది.

ఆనందరావుది ధాన్యం వర్తకం. కాని భావకవి. కళ్యాణి పాటమీద మూడు గీతాలు రాశాడు. తక్కిన తన కవిత్వంతో బాటు ఆ గీతాలు అజ్ఞాతంలోనే వుండిపోయినాయి. అతని గీతాల్ని మెచ్చుకున్నవారే కాని అచ్చు

వేసినవారు లేరు. అవే అచ్చుపడితే తనకి చాలా గొప్పకీర్తి వొస్తుందని అతని దృఢవిశ్వాసం. కాని ఆ విశ్వాసం ఏ పబ్లిషర్సుకీ లేదు. అత నెంత వినిపించినా, శ్లాఘించుకున్నా వాళ్ళకా విశ్వాసం కుదరలేదు. రెండేళ్ళ క్రిందట ఓ సారి బెజవాడలో రైలులో ఖాళీ దొరక్క తంటాలుపడుతూ వుండగా First Class లోనించి తన పేరు కేక వేశాడు ద్వారకన్న. ద్వారకన్నా తానూ ప్రెసిడెన్సీ కాలేజీలో సహాధ్యాయులు. ద్వారకన్న చాలా ధనవంతుడు. తెలుగు తెలుసు. హాస్టల్లో ఒకటే గది వాళ్ళది. ఆ రోజుల్లోనే తాను రాసే కవిత్వం వినిపించేవాడు మిత్రుడికి. అతను ఆనందించేవాడు. ఈనాడు తనని చూడగానే, కుశలప్రశ్న లడుగుతూ వుండగా రైలు కూసింది బైలుదేరడానికని. ఆనంద్ పరిగెత్తడానికి ప్రయత్నించాడు:

"ఎక్కడికి?"

"ఏలూరులో కనపడతా. రాజమండ్రి వెళ్ళాలి."

ద్వారకన్న మాట్లాడకండా అతన్ని లోపలికి గుంజాడు. ఆనంద్ తన పసుపుపచ్చ టిక్కెట్టు చూపాడు.

"పరవాలేదు. నేను చూసుకుంటాలే" అన్నాడు అతను.

అది ఒకటేసారి అతను మొదటితరగతిలో ప్రయాణం చేసింది. అంత బీదవాడు అతను. అందుకనే తనగీతాల్ని అచ్చు వేయించుకోలేకపోయినాడు. ద్వారకన్నకి అతని కవిత్వం చాలా జ్ఞాపకం. కొత్త గీతాలు చదవమన్నాడు. ఆ కవి హాయిగా పరుపుల్ని ఆనుకుని, పంకాలకింద టీ

తాగుతూ, రొష్ట్ర తింటూ, State Express సిగరెట్లు అంతం లేకండా కాలుస్తూ, రాజమండ్రిదాకా తన కవిత్వం అప్ప చెప్తున్నాడు సహృదయుడైన మిత్రుడికి. ఆ రోజు అతని కేదో రాజయోగపు గ్రహం పట్టిందనుకున్నాడు తరవాత రోజులో.

"మరి అచ్చు వేయించావుకావేం! ఇంత గొప్ప కవిత్వాన్ని!"

"ఎవరు వేస్తారు?"

"నువ్వే!"

"నేనేం బిర్లా ననుకున్నావా, దొరైకన్ను ననుకున్నావా?"

"దొరైకన్ను ననుకో, పుస్తకం పంపించు."

తన అచ్చుగాని గీతాల్ని సదా చేత్తో పట్టుకుని తిరగని భావకవి ఇంతవరకు జన్మించలేదు.

"పంపడ మెందుకు? ఇక్కడే వుంది."

అని మిత్రుడి కిచ్చాడు తన కావ్యాన్ని.

"అచ్చువేయించి నీకు పంపుతాను."

"ఎట్లా వుండాలంటే పుస్తకం...?"

"నా కవేం చెప్పనక్కర్లేదు. నీ పుస్తకం పోకుముందు ఓమర్ ఖయాం, ఊర్వశీ ప్రవాసం, గీతాంజలీ, ఎందుకూ పనికిరాకండా కనపడేట్టు వేయిస్తానుకదూ!"

"ఎందుకు నువ్వు వేయించడం?"

"నేను చదువుకోడానికి. రాతఅక్షరాలు చదవలేను బాగా. అచ్చువేయించి చదువుకుంటాను. జాగ్రత్తగా చదువుకోవాలి కొన్ని గీతాలు, వాటి సారస్యం అర్థంకావా లంటే. నీకు అయిదువేలకాపీలు వేయిస్తాను. చాలా?"

"దేనికి చాలా? ప్రజలకా? మా దేశంలో ఓ వెయ్యి సంవత్సరాల అమ్మకానికి చాలు అవి"

తన కవిత్వంమీద ద్వారైకన్న ఇష్టం. తనకీ కళ్యాణి సంగీతంమీద ఇష్టంలాగే వుంది.

ఆనాటి తరవాత తాను కళ్యాణిసంగతి వినలేదు, ద్వారైకన్న సంగతి వినలేదు; తన గీతాలేమైనా యోకూడా తెలీదు. రెండేళ్ళయింది.

ఈనాడు వినా్నడు ఆ రికార్డు మళ్ళీ. ఆ రాత్రి రాయపురంలో తన host ని కళాప్రియుణ్ణి అడిగాడు "కళ్యాణి అని ఒకామె రేడియోలో పాడేది నీకు గుర్తుందా? రెండు రికార్డులుకూడా ఇచ్చింది."

"తెలీదు, కాని, ఏం?"

"ఆమె ఏమయిందని?"

"లేదా? ఎందుకు?"

"ఆమె పాట నాకు చాలా యిష్టం."

"ఆమె పాటా? ఆమా? రెండూనా?"

"ఆమెని చూడలేదు నేను."

"ఏమయిందో రేడియోవాళ్ళ నడుగు."

"రాశాను. వాళ్లు చెప్పరట."

"వెళ్ళి అడుగు."

"ఎవరు మాట్లాడతారు?"

"అదేమిటి మన రాజయ్యకి ఢిల్లీనించి మద్రాసు స్టేషన్‌కి బదిలీ అయింది, తెలీదా?"

"రాజయ్యకా? కాని ఇది పాతచరిత్ర కళ్యాణిది."

"కనుక్కొని చెప్తాడులే, వుండు." అని ఫోనులో రాజయ్యని పిలిచాడు.

"ఎప్పుడు తీరుబడి? మన ఆనందరావొచ్చాడు. ఇక్కడే నాతోనే వున్నాడు. ఎప్పుడు వొస్తావు? మధ్యాన్నం భోజనానికి రా ఒంటి గంటకి. మరిచిపోకు వెధవా." అని ముగించాడు.

చప్పున మళ్లీ కాల్ పెట్టి, రాజయ్యని మళ్లీ రప్పించి,

"రేపు రాకపోతివా, నీ కంఠధ్వని చచ్చిపోయే పంది గురకమల్లే, చెడిపోయిన Ford కారు చప్పుడల్లే వుందని రాస్తాను మీా స్టేషన్‌కి" అని ఆనంద్ చెప్పమంటున్నాడు"

అని ఫోన్ కిందపెట్టేశాడు.

ఒంటిగంటకి వొచ్చి వొండినవన్నీ తినేశాడు రాజయ్య.

"నీతో వోపని వుందోయ్."

"అవును."

"అవునేమిటి? నీ కెట్లా తెలుసూ?"

"పనిలేకపోతే, నామీాద ప్రేమవల్లనే, నా జ్ఞాపక మాధుర్యం భరించలేకనే నన్ను భోజనానికి పిలిచావను కున్నానా ఏమిటి?"

"ఏం? నీతో ఏంపని?"

"ఈ కాలంలో న్యూసు పేపరు రిపోర్టర్లతో, రేడియో మనుషులతో పనిలేనివాణ్ణి ఒక్కణ్ణి చూపించు. వాడికి నా ఖర్చుతో శిలావిగ్రహం కట్టిస్తాను."

"ఏడిశావ్రులే నెధవగర్వం. ఏదో ప్రపంచచక్రం నీ మీద నడుస్తోందనుకుంటున్నావు. నీ 'ఇనికతట్టల' సంగీతం నువ్వూ ఆవు. 'ఇంతవరకూ మీరు రికార్డుల సంగీతం విన్నారు' అన్న మహా తెలివైన వాక్యం చెప్పడమేగా నువ్వు చేసేపని! నువ్వు వేరే చెప్పాలా ఆ సంగతి? రేడియోలముందు మేము యేమంటోవుంటామో అవి మీకు వినిపించేవిధం వుంటే బావుండును."

"పోస్టులో వినిపిస్తోనే వుంటారు"

"అసలు మేము అనేమాటలు రాయడానికి వీల్లేదులే. పైగా వాటికో ముక్కానీ ఖర్చు!"

"సరేలే, ఇంతకీ ఏమిటో ఏడు. ఎవత్తెకో ప్రోగ్రాం ఇప్పించాలి. అంతేనా? ఆడిషన్ వుండకూడదు. ఏంపాడు తుంది? రెండునిమిషాలకో సారి అప్రయత్నంగా శ్రుతీ లయా మారుతో ఎవరూ ఎన్నడూ వినని సొంతరాగంతో తాళంలో—

"తల ఎత్తి చూడరా, ఆంధ్ర సోదరుడా,

విలపించుచున్నాది భారతమాత!" అది పాడింది—

మొన్న ఒకామె,

ఓ తెలుగు రేడ
పదవోయి అడుగోను నీ తెలుగు మేడ
కట్టవోయ్ నీచుట్టు ఓ తెలుగు గోడ
వీడ్వవోయ్ కనపడక నీ తెలుగు జాడ
బెదరకోయ్, రేడ, అది అరివనీడ
ఎగురుచున్నది చూడు నీ తెలుగు దూడ
అలకవోయ్ నీళ్లల్లు తెలుగు గేదెల పేడ
తొలగించవోయ్ అఖిలాంధ్ర దేశంబు పీడ
ఓ తెలుగు రేడ, నా తెలుగు రేడ.

కాకపోతే.

కోవెల కూసింది.
గాలులు వీచాయి.
త్యాగయ్య పాడాడు.
దుమ్ము చెలరేగింది.
తుమ్మెద ఎగిరింది.
మబ్బుల్లు వేశాయి.
రారా, రారా, ప్రియ్యా, రంగం పోదామూ—
అంటుంది.

"మీరు అంతకన్న మంచివాళ్ళని వరుకుంటున్నారా - ఎవరికి తెలీదురా. అక్కడ పాడేవి కంఠాలు కావురా! చీరెలు, రెవికలు లేకండా—

"పోరా. అందరిమల్లే నువ్వూ బుద్ధిలేకండా మాట్లాడతావు!"

"వినపడుతోనే వుంటాయి లేరా!"

"ఏమిటి?"

"చుప్, చుప్ మని శబ్దాలు రేడియోలో."

ముగ్గురూ నవ్వారు.

"సరేలే, తొరగా చెప్పు పోవాలి."

"రెండేళ్ళకిందట కళ్యాణి అని యీ స్టేషన్‌నించే పాడేది నీకు తెలుసా?"

"తెలీదు."

"తెలీదూ? తెలీపోతే ఎందుకు బతుకుతావు? ఆ మైక్‌కి ఉరేసుకు చావరాదూ?"

"ఎత్తు చాలదు."

"ఆమె ఏమయిందో కనుక్కొని చెప్పు,"

"ఏమయింది."

"అదే నిన్నడుగుతోంది, మొద్దూ. రేడియోలో వినపట్టంలేదూ, ఆమె సంగీతం."

"రాసి కనుక్కోకపోయినావూ?"

"నీ అంత బుద్ధితక్కువవాళ్ళ మనుకోకు. ఒకే వొప్పు చెప్పరా, చూద్దాం."

Under the Spreading Chestnut Tree. రాదా? బెంచెక్కు, జ్ఞాపకం వుందా?"

"రాశాంరా బాబా. తెలీదన్నారు నీ అంత తెలివే గల నీ సోదరులు."

"కనుక్కుంటాలే. ఎందుకు ఆ కళ్యాణి నీకు?"

అవును తనకి ఆ కళ్యాణి ఎందుకు; అనుకున్నాడు కాని ఎందుకో కావాలని అనిపించింది.

"ఎందుకోలే, కనుక్కుందూ."

"సరేలే. నాకు తీరిక లేదు. టెలిఫోనులో చెపుతాను." అని వెళ్ళి టెలిఫోనులో చెప్పాడు మర్నాడు—

"అవును, ఆ కళ్యాణిది చాలా విచిత్రమైన చరిత్ర లాగుందోయ్. విను. ఆమె బీద ఆమె. కాని..."

"అదంతా నాకెందుకు? ఆమె ఇప్పు డెక్కడవుంది?"

"ఏమో, తెలీదు."

"ఇదా నువ్వు తెలుసుకుంది?"

"తెలీదంటోవుంటే."

"సరేలే, చావు"

"విను మరి."

"ఇంకా వినేదేమిటి?"

"ఆమెసంగతి."

"ఆమెసంగతి నాకెందుకు? ఏమయిందో కావాలి. అది తెలీకపోయింతరవాత..."

"చూడు, మనవాడితో చెప్పు రాత్రికి భోజనానికి వస్తున్నానని. తొమ్మిదింటికి. ఆ వాక్కాయల పచ్చడి, ఆవడలు, ఆ పనసకాయ కూర, అన్నీ మళ్ళీ చేయించమను"

"ఏమిటి రాత్రిపూటకా?"

"మరి పగలు డ్యూటీ నాకు. రాత్రికే."

అని టెలిఫోను మూసేశాడు.

రాత్రి చెప్పాడు కళ్యాణి వైనం—

"ఆమె చాలా బీదరికంలో వుండేదిట. గొప్ప పాటకు రాలు కాదు. కాని కంఠపు మార్దవంతో నేర్పరితనంతో పాటని మెరిపించేది. డబ్బుకోసమే రేడియోని ఆశ్రయించింది. ఒక విధమైన అభిరుచులవారు ఆమెపాటకి ఇష్టపడేవారు. చప్పున ఆమె అదృష్టం తిరిగింది. ఆమె రూపవతి. ఆమె పాటని ఇష్టపడ్డ ఒక సినిమా డైరెక్టరు, ఆమెని ముఖ్య పాత్రకై బుక్ చేసుకుంటా నన్నాడు. ఆమె ఆలోచించిగాని చెప్పనన్నదట. ఆ సమయానికే ఒక జమీందారు ఆమెని తనకి పాడుతో వుండడానికై పెద్ద జీతమిస్తానని ఆహ్వానించాడు. గ్రామఫోనువాళ్ళు ఆమె వెంటపడ్డారు. పాటకచ్చేర్లకి పిలవడం ప్రారంభించారు. ఇదంతా ఎట్లా తెలుసునంటే, రేడియోలో భద్రయ్య రహస్యంగా ఆమె ఇంటిదగ్గర ఆమెకై పడగాపులు పడుతున్నాడు."

"ఏమిటి? భద్రయ్యా? నాన్ సెన్సు!"

"ఏమి టా నాన్ సెన్సు."

"భద్రయ్య నీతి అవతారం కాదుటోయ్? నాట కాల్ని, నీతి Standard కి వ్యతిరేకమని, రేడియోలో ప్రసారం చెయ్యకూడదని పోట్లాడుతాడు కాదుటోయ్?"

"అవును. అందులో విచిత్రమేముంది? అవినీతికథలు వెయ్యమనే పత్రికాధిపతుల నీతిచరిత్రలు పరిశీలించు."

"ఓ, అదా? అంటే తమకితప్ప శ్రోతలకి శృంగారం మీాద బుద్ధి పోకూడదనేమో!"

"కాదోయ్. వీళ్లోరకమైన రసయోగులు. సంస్కారాధిక్యతవల్ల అవినీతిని భూషణంగా ధరించి భర్జించుకోగల రన్నమాట. తమది ఉన్నత శృంగారాన్వేషణ. తక్కిన వాళ్ళది తుచ్ఛ వ్యభిచార వాంఛ."

"సరేలే చెప్పు. ఆ రాజయ్య ఏం చేశాడు కళ్యాణిని?"

"ఏమో ఎవరికి తెలుసు? ఈ శృంగారజీవులు తమ విరహబాధనేగాని, విరహనివృత్తిని చాటుకోరు. రోజూ రేడియో స్టేషనులో విలపించేవాడుట, ఆ కళ్యాణి ఏదో మానుషాతీత జ్యోత్స్న అని."

తాను ఆమె పమిటచెంగును స్పృశించటానికి అనర్హుణ్ణనీ, ఈ లోకపు పురుషకీటకాలు ఆమెను డబ్బు ఆశతో భ్రమపెట్టి తననించి తీసుకొనిపోయి వాంచించాలని చూస్తు న్నారనీ. కాని ఆమె బీదరికం ఆమె మనసుని ఎప్పుడు బలవంత పెడుతుందోనని అతని భయం.

"ఆమె ఏమంటోందిట?"

"ఆమెకి పురుషులతో సంబంధం చాలా ఏహ్యం. తనమీాద ధనాలు గుమ్మరిస్తామని తిరిగేవారి ఉద్దేశ్యాల మీాద అనుమానం వల్లనే ఆమె ఆ Offers అన్నిటినీ నిరాకరించింది."

"నేను చెప్పలేదుటోయ్, ఆమె చాలా ఉన్నతురాలని?"

అన్నాడు ఆనందరావు.

"రాజయ్యా ఏమంటాడు ? తనతో ఉచితంగా ఆమె చెయ్యాలని తాను కోరుకుంటున్న పనినే, ధనం తీసుకుని ఆమె ఇతరులతో చెయ్యకూడదంటాడు. అవునా!" అని అడిగాడు వాళ్ళుహాస్యు.

"ఆ ధనం ప్రసక్తి వచ్చిందా అది రొమాన్సు కాదంటాడు ధనికుడు. దరిద్రంలో ఏడుస్తో స్త్రీ, ఆమె ఆత్మ ఔన్నత్యంకోసం, ప్రేమపారిశుధ్యంకోసం, ఏ ఆశాలేని నిర్మలమోహమని రుజువు చేసేందుకై ధనికుణ్ణి డబ్బు అడిగి బాధపెట్టకూడదు."

"అవును. ఇంక ఆమె ఇంటిచుట్టు తిరిగి, ఆమెఇంటో టిఫిన్లు తిన్న భద్రయ్యా, తన నాలుగువందలరూపాయల జీతంలో ఆమెకి ఒక్క కానీ ఇచ్చి ఎరగడు" అన్నాడు రాజయ్యా.

"ఎంత గొప్ప స్త్రీ! కనకనే అంతగొప్ప సంగీతం పాడగలిగింది." అన్నాడు ఆనంద్.

"పోనీ భద్రయ్యకి ఏమన్నా ముట్టిందా?"

"తెలీదన్నానుకదూ. అతని ప్రణయచరిత్ర అంతా ఏడుపులతోనే సరిపోయింది."

"తరువాత?"

"ఓ రోజు తెల్లవారేసరికి ఆమె ఇంటో లేదు."

"ఏమయింది? చచ్చిపోయి వుంటుంది. ఔనా?"

"ఇంతవరకు మళ్ళీ ఆమెను చూసినవారు లేరు."

"భద్రయ్యా బాధ పడలేక పారిపోయి వుంటుంది."

"ఆ ధనవంతుల ప్రాబల్యానికి జడిసి, దాక్కుని వుంటుంది."

"దరిద్రం అనుభవించలేక చచ్చిపోయి వుంటుంది."

"ఏం చేస్తుందిమరి! ఇంటికి వెడితే సినీమా డైరెక్టర్లూ రేడియోకి వొస్తే భద్రయ్యా!"

"ఏంలేదు ఆమె లేచిపోయింది." అన్నాడు రాజయ్య.

"నాన్ సెన్సు!"

"ఎవరితో?"

"ఎవరో ధనవంతుడైన చెట్టియార్ తో."

"నిజమా?"

"నిజమే."

"తరవాత?"

"తరవాత ఏంలేదు. ఇంతవరకు తెలీదు ఏమయిందో" అని చెప్పి వెళ్ళిపోయినాడు రాజయ్య. అంతటితో తన అభిమానం సిగ్గుపడి కళ్యాణి ప్రసక్తి వొదులుకున్నాడు, ఆనందరావు. ఆనాటినించి ఆమె రికార్డువిన్నా ఏమీ సంచలనం కలగలేదు అతనిలో. అలా సెంటిమెంట్లతో అల్లు కుని వుంటాయి కళాభిరుచులు.

కళ్యాణి పాటవిని ఆమెని ఓ ఎత్తు పీఠంమీాదికి ఎత్తాడు, మనిషినే. ఆమె చెట్టియారుతో వెళ్ళిందని విని ఆ మనిషిని పీఠంమీాదనించి కిందికి లాగడమే కాదు, ఆమె సంగీతాన్ని అసహ్యించుకున్నాడు.

బీదరికంలో మాడి ఆమె చచ్చిపోయిందంటే, ఆమె మీద ఓ గీతం రాసేవాడు గౌరవంగా. వ్రాసి తన ఆరాధనా రుణం తీరిందనుకుని తృప్తిపడేవాడు ఆ కవి.

రెండేళ్ళు గడిచాయి.

ఆనందరావుకి యుద్ధకాలంలో వ్యాపారంలో లాభం రాసాగింది. అంతటితో తాను ఒకప్పుడు కవినని పూర్తిగా మరిచిపోయినాడు. అంత సంబంధం, ఆకలికీ కవిత్వానికీ—తిండికోసం ఆకలి ఒకటేకాదు ఆకలి.

అతను ధాన్యం అమ్మే వడ్ల మిల్లు యజమాని, అతని కూతురు పెళ్ళికి ఆనందరావుని భోజనానికి పిలిచాడు. భోజనానంతరం ఎవరో ఆనందరావుని అతను రాసిన గీతాలు చదవమన్నారు. ఆనందరావు కవిత్వం రాస్తాడా అని ఆశ్చర్యపోయినారు మిల్లువారు. తనతో పైసల దగ్గర్నించి ఆనందరావు చేసే కటిక బేరాన్ని తలుచుకుంటూ, ఆనందరావు ఒక్కొక్క గీతాన్నే ఎత్తుకున్నాడేగాని ప్రతి దాన్ని మధ్యలోనే మరిచిపోయినాడు. బియ్యం ధరలు తప్ప ఇంకేమీ జ్ఞాపకం లేవు అతనికి.

మిల్లువారు సంవత్సరన్నరలో రెండు లక్షలు లాభాలు చేసుకున్నారు. తన వక్క కూతురికీ పెళ్ళి సమయం. ధనంతోబాటు, అకస్మాత్తుగా ఆయనలో కళా రాధన ఉద్భవించింది. తానెందుకు కవి రసపోషకుడుగా ప్రసిద్ధి కెక్క గూడదు? ఆరాత్రే ఏర్పాటు జరిగింది. ఆనంద రావు గీతాలు మిల్లుకు అంకితమిచ్చేట్టూ, ఒక వెయ్యి కాపీలు అచ్చువేసి, వాటిని అమ్మి సగం లాభం ఆనంద

రావుకి ఇచ్చేట్టు — ఖర్చులుపోగా సగంలాభం అవి అమ్ముడుపోయిననాడు.

కాని అచ్చు వెయ్యడానికి ఆనందరావు గీతాల పుస్తకం ఏదీ?

దొరైకన్ను చిరునామా తెలీదు. మద్రాసులో చిన్నప్పటి అతని ఇల్లు గుర్తు. ఆ అన్వేషణలో మళ్ళీ మద్రాసు వొచ్చాడు ఆనందరావు రెండేళ్ళ తరవాత.

దొరైకన్నుని పట్టుకోడం కష్టంకాదు. ధనవంతుడు. చాలా ఆస్తి మద్రాసు ప్రాంతాలలో. కాని ఎవరూ అతనేమైనాడో ఎరగమన్నారు. అతనివాళ్ళెవరూ లేరు. అతని వ్యాపారం కంపెనీ ఎప్పుడో ఎత్తేశారు. కాని వెతికేది కవి. కాంతిని చూడబోయే తన కవిత్వంకోసం. అంటే తల్లి తన బిడ్డకోసం వెతుకుతోంది అన్నమాట.

చివరకి దొరైకన్ను ఏజంటుని పట్టాడు. దొరైకన్ను ఎక్కడికో వెళ్ళిపోయినాడు. ఎక్కడికి వెళ్ళాడో తనకి తెలియదన్నాడు ఆ ఏజంటు చాలా బలవంతం మీాద - దొరైకన్ను చిరునామా ఎవరికీ ఇవ్వద్దన్నాడన్నాడు. దివాలాతీసి, అప్పులపాలైనాడా? లేదు. ఆస్తిఅంతా అట్లానే వుంది, మరి...?

తను ఒక ఉత్తరం ఇస్తాను దొరైకన్నుకి పంపమని వొప్పించాడు ఏజంటుని. మూడోరోజుకి టెలిగ్రాం వచ్చింది, ఆనందరావుని ఏజంటునే స్వయంగా తీసుకుని రమ్మని. ఎక్కడకు తీసుకు రమ్మన్నాడో చెప్పనన్నాడు ఏజంటు.

ముందు రైలెక్కారు బెంగుళూరు మెయిలులో. తరవాత కారెక్కారు. ఆకారు నిర్జనమైన కొండలదగ్గిర వాళ్ళిద్దరిన్నీ దింపివెళ్ళింది. అక్కణ్ణించి నడిచారు. ఓ నది అడ్డం వొచ్చిందాకా. అక్కడ షోకైన పడవ, తెల్లటి రంగు, నిగనిగలాడే సీట్లు. పట్టు పరుపులు, పైనపందిరి. మహారాజులకైనా అట్లాంటి పడవలుంటాయా? దాంటో ఆనందరావుని ఎక్కించి ఏజంటు తిరిగి వెళ్ళిపోయినాడు. ఆ పడవ అతన్ని ఆ నదిమధ్య ఓ ద్వీపంలో దించింది.

వొడ్డున అతనికోసం ఎదురుచూస్తో నుంచునివున్నాడు దొరైకన్ను. చిరునవ్వుతో తనచేతినిజాచి వొడ్డుకి దించాడు. కాని ఏమీ మాట్లాడలేదు. వెనక్కితిరిగి నడుస్తున్నాడు. ఆనంద్ అతనివెంట వెళ్ళాడు. దొరైకన్నులో చాలా మార్పువుంది. అతనిదృష్టి ఎక్కడో ప్రయత్నించి ఆనంద్‌ని తన మనస్సులోకి తీసుకున్నట్టుగా వుంది; ఆ ద్వీపం ఒకప్పుడు ఒక పెద్ద అడవి ఐవుండాలి. ఆ పెద్ద పురాతన వృక్షాల్ని అట్లానే వుంచి, కింద భూమినంతా శుభ్రం చేశారు. కిందపడ్డ ఆకుల్నికూడా ఏరుతో పనిమనుషులు ఎండనీడల్లో తిరుగుతో కనపడు తున్నారు. ప్రతి మూల నించీ, చెట్ల సందుల్లోంచి అన్నివేపుల నది కనపడుతోంది. పాయలుపాయలుగా ద్వీపంలోకి కోసుకుని వొస్తోంది. నీళ్ళు వెనకాలికి వెళ్ళిన స్థలాల్లో కొన్నిచోట్ల అద్దంమల్లే ఒంద్రు మట్టి మెరుస్తోంది. కొన్నిచోట్ల పచ్చని ఇసిక. ఆ నది కావేరి ఐవుంటుందనుకుంటున్నాడు ఆనంద్. చెట్లపైన కోతులు, పెద్దపెద్ద ఉడతలు పక్షులు కోలాహాలం చేస్తున్నాయి. కొన్ని

చెట్లు మనుషులు నాటినట్లున్నారు. మంచిగంధం, టేకు, మర్రి, తురాయి, నిద్రగన్నేరు చెట్లు గుర్తుపట్టాడు ఆనంద్. మధ్యమధ్య చిన్నచిన్న పూలతోటలు వేశారు. సంపంగి, తీగసంపంగి, మాలతి, మధుమాలతి, మాఘవీలతలు, గుత్తులు గుత్తులుగా పూలు వేళ్ళాడుతున్నాయి.

నదికి కొంచెం దూరంగా నది కనపడుతూ పెద్ద దేవదారు వృక్షాలముందు వున్న ఒక వింత కాటేజి దగ్గరికి వెళ్లారు. అదంతా జపాను పరజాలలో అలంకరించారు. తలుపులూ గోడలూ లేవు. కొబ్బరాకుతో, రెల్లుతో, పల్చని రంగుల కాయితాలతో, పూల అద్దకపు బట్టలతో, చిన్న చిన్న చిత్రపటాలతో తయారుచేశారు. అంతా వెదురు పేము సామాను. కింద గచ్చు. దానిమీద చాలా అందమైన డిజైన్లువున్న మెత్తని రెల్లుచాపలు. బైటనించి కాంతి చెట్ల ఆకుపచ్చలోంచి, నదినీళ్ళమీది మెరుపులోంచి, ఆ రంగు కాయితాలలోంచిఅందఅందాలుగామృదువుగా పడుతోంది. లోపల మూడుగదులకన్న ఎక్కువలేవు. కాని పరజాలులాగి ఎక్కడికక్కడ గదులు కల్పించుకోవచ్చు. లోపల గ్రామఫోను, వీణలు, సితారు వున్నాయి.

వెళ్ళగానే దూరంనించి ట్రేలతో టీ, కేకులు, రసగుల్లాలు, వేయించిన అటుకులు తడివడియాలూ, అప్పడాలు తెచ్చారు నౌకర్లు. అవతల గదిలో పెద్ద లైబ్రరి కనపడుతోంది. ఇతను చూస్తూవున్నా ఇక్కడ ఇంత అందంలో. అన్నిదిక్కులనించి గాలుల పువ్వుల పరిమళాలతో ఆ ఇంటి నిండా ఆడుతుంటున్నాయి, చిన్నచిన్న చప్పుళ్లు చేస్తుంటో.

ఆనందరావుకి నిశ్చయమయింది, తనపుస్తకం సంగతి దొరైకన్నుకి ఏమీ జ్ఞాపకంవుండి వుండదని. అడవిలో ఇట్లా వొంటరిగా నివసించే అతన్ని ఎట్లా అడగడం? అతనికీ ప్రపంచానికీ సంబంధం వున్నట్టులేదు. ఆ ప్రదేశం అందం వొంటరితనం, ఏదో వాతావరణం ఆనందరావునించి మాటలు లాగేశాయి. దొరైకన్ను మాట్లాడడేం పోనీ! మునిగి ఐనాడా, ఋషి ఐనాడా, పిచ్చా!

"చాలా అందంగావుంది. ఇక్కడ. ఇది ఈ పాత భూలోకమే అనిపించడంలేదు." అన్నాడు ప్రయత్నించి ఆనందరావు.

అప్పుడు తట్టింది ఆనందరావుకి. దొరైకన్ను చచ్చిపోయినాడు. తానూ చచ్చిపోయినాడు ఇది ఇంకో లోకం. కాక తను చచ్చి ఈ కల కంటున్నాడు. దొరైకన్ను ఇంకా మాట్లాడలేదు. మాటలు మరచిపోయి జ్ఞాపకం తెచ్చుకుంటున్నట్టున్నాడు.

"ఎట్లావుంది ఆ పాతభూలోకం?" అన్నాడు.

"ఎన్నాళ్ళయింది నువ్విక్కడికివొచ్చి?"

"ఇక్కడ కాలం లేదు."

అప్పుడు కాలెండరుగాని, గడియారంగాని ఏమీ లేవు అక్కడ. ఆకాశంకేసి చూశాడు. సూర్యుడు వున్నాడు. కదిలినట్టుకూడా వున్నాడు.

మెల్లిగా పరదాల్ని వొత్తిగించుకుని ఒకామె వొచ్చి కూచుంది వాళ్ళవంకచూస్తో, పెదిమిలమీద ఆహ్వానపు చిరునవ్వుతో. ఆమెవొచ్చినట్టుగుర్తించనేలేదు దొరైకన్ను.

"నాలుగై దేళ్ళు అవుంటుంది."

"నీకు టపా రాదా ఇక్కడకి?"

"రాదు."

"మరి నా వుత్తరం ఎట్లా చేరింది?"

"చేరలేదు."

"మరి నీ ఏజెంటు..."

"చెబుతాలే."

"భూలోకంలో ఏం మార్పులు జరిగాయో నీకు తెలీదా? న్యూస్ పేపర్లు రావా?"

"రావు."

"బ్రిటీషు వారు వెళ్ళిపోయారనీ, దేశానికి స్వాతంత్రం వొచ్చిందనీ నీకు తెలీదా?"

"తెలీదు."

అని ఆమె కేసి చూశాడు అంతే.

"ఇంకేం తెలుసుకోవాలని లేదా?"

"లేదు. మాకెందుకవన్నీ ఇక్కడ?"

"ఎక్కడ ఇది?"

ఆమె ఫక్కున నవ్వింది.

"ఎందుకదంతా?"

"నీకు అక్కర్లేదులే. మరినన్ను ఎప్పుడు పంపుతావు?"

"ఎక్కడికి?"

"మావూరికి."

చిరునవ్వు నవ్వాడు ద్వారకనున్న.

"ఎందుకు వెళ్ళడం?"

"ఎందు కేమిటి? వెళ్ళక?"

"ఉంటా వనుకున్నాను."

"వెళ్ళడానికి వీల్లేదు. ఇక్కడికి వచ్చినవాళ్ళకి తిరుగు ప్రయాణం లేదు." అంది నవ్వుతో ఆమె.

అతనిగుండె ఓ నిమిషం ఆగింది.

"ద్వారై, నిజంచెప్పు. నాతో వేళాకోళం ఆడకు."

"వుండు. అంత తొందరా? ఇక్కడేం బాగాలేదా?"

"వుందిలే. కాని..."

"అదంతా తరవాత, రా పోదాం."

ముగ్గురూ బైటికి వెళ్ళి అట్లా అట్లా తిరిగారు. ఇంత అందంలోంచి ఎవరుమాత్రం ఎట్లా వెడతారు? ఇక్కడ, ఈ లోకంలో ముసలితనం, కష్టం, దిగులు, చీదర, ఏమీ లేనట్టున్నాయి. ద్వారైకన్న వయసులో ఎదగటం మానేసి నట్టు కనపడ్డది ఆనందరావుకి.

చల్లనిగాలిలో, అడివిపక్షుల రుతాల్లో, అనేకపరిమళాల రంగుల పుష్పవనాల్లో, చెట్లమధ్యనించి కనపడే నది, పై కొమ్మల్లోంచి కనపడే ఆకాశంనీలం యెంత తాగినా కళ్ళకు తనివి తీరలేదు.

ఇంటికి వొచ్చి భోజనంచేశారు. కారంలేదు వంటలో. పులుపులేదు. అన్నీ కమ్మగా, తియ్యగా వున్నాయి. చాలా వరకు పళ్ళు, పళ్ళరసాలు.

భోజనమయ్యాక, కొంచెంసేపు ఇంటిముందున్న పొగడచెట్లకింద కుర్చీలలో కూచున్నారు.

"కొంచెంసేపు నిద్రపో, చదువుకో"

అని పుస్తకాలుపడేసి వెళ్ళిపోయినారు వాళ్ళు.

ఎప్పుడు నిద్రపట్టిందో.

నిద్రలో సంగీతం వినిపించింది. మధురమైన కలలతో కలిసి. ఎవరో కిన్నెరలు పాడుతున్నారు. అందమైన స్వప్న వృద్యానవనాల్లో తా నెరిగిన కంఠాలు అవి. ఎప్పుడో ఏజన్మలోనో ఎరిగినవి. సగం మెళకువ వచ్చింది గాని, అతనికి కళ్లు తెరవాలనిపించలేదు. అతనివూళ్ళో అతని గది లోనే కల కంటున్నా ననుకున్నాడు.

ఆ కల కంటూనే మళ్ళీ నిద్రపోయినట్టున్నాడు. కళ్లు తెరిచేప్పటికి మధ్యాహ్నం దాటింది. అతని మొహంమీద ఎండపడుతోంది ఆకుల సందుల్లోంచి. ఎదురుగా వాళ్ళిద్దరూ టీ తాగుతున్నారు.

"లేచావా? రా."

ఎంత నిశ్శబ్దం? నౌకర్లు మాట్లాడరు, చాలావరకు కనపడరు.

మెల్లిగా జ్ఞాపకం తెచ్చుకున్నాడు. తానిక్కడకు వొచ్చిన సంగతి, హల్వా తిని టీ తాగుతో.

"మరి నా పుస్తకం ఎక్కడ వుంది?" అన్నాడు.

"నీ పుస్తకమా? ఏమయిందో? నాకు గుర్తా?" అన్నాడు దొరైకన్నా పరధ్యానంగా.

ఆమె నవ్వింది.

"మరి నన్నెందుకు రమ్మన్నావు ఇక్కడికి?"

"నిన్ను చూడాలని. నువ్వు నన్ను చూడాలని. ఈమెని నువ్వు చూడాలని, మే మిద్దరం నిన్ను చూడాలని"

"నన్ను చూడాలనా? నన్నెందుకు?"

"నువ్వీ లోకంలో అనామకుడవి కావు."

"నేను జీవించే వున్నానా? ఎక్కడ?"

"కవులు ఎక్కడ జీవిస్తారో అక్కడ?"

"ఎక్కడ?"

"ప్రేమికుల హృదాయాల్లో."

"అంటే ఆ కవి కవిత్వాన్ని ప్రేమించే హృదయాల్లో." అంది ఆమె.

"నా కవిత్వం ఎవరికి తెలుసు?"

"ఈ లోకంలో నిన్నెరుగుదురు. అందుకనే ఇక్కడికి వొచ్చావు. యెవరు పిలిచిందీ లేదు."

"ఎందుకు వొస్తాను నే నిక్కడికి?"

"ప్రేమ పిలుపువల్ల."

"నా పనులన్నీ చెరుపుకుని."

"వంపని నీకు?"

"ఏ పనీ చెయ్యకుండా నే కుటుంబం జరుగుతోందా?"

"ఆ భారం వహిస్తారులే."

"ఎవరు?"

"ఈ లోకంలో వాళ్ళు."

"పోనీ నా పుస్తకం సంగతేమిటి?"

"ఆ పుస్తకం నీకెందుకు ఇవ్వాడు?"

ఆమె నవ్వింది.

ఎంత అందం ఆ నవ్వు!

చెప్పాడు కథ, తన పుస్తకం అచ్చువేయిస్తానన్నా రని.

"నాలుగు వేల కాపీలిస్తాడా నీకు? ఎన్నేళ్లు అమ్ముతావు అవి?"

"నం దేళ్లు. ఎవడుకొంటాడు?"

"మరి యెందుకు అచ్చువెయ్యడం?"

"ఏమిటో! సరదా."

"మళ్లా రాసుకో ఆగీతాలు."

"చాలా సులభం!" అన్నాడు ఆనందరావు వెకిలింపుగా!

"అయినా పుస్తకం ఎంత ఖరీదు పెడతావేమిటి?"

"ఏమో, ఇప్పుడేం తెలుస్తుంది"

"రెండు రూపాయ లనుకో"

"అబ్బో, అంతే?"

"ఆ ప్రకారం అవన్నీ అమ్ముడుపోతే ఎనిమిది వేల రూపాయలు. నే నిస్తాలే."

"ఎందుకు? పనిలేక. డబ్బుకోసమా అచ్చువేసుకుంటోంది?"

"బీదవాడినంటివిగా?"

"అవునులే. ఆ కాపీలు అమ్ముడుపోయి డబ్బు వొచ్చి నప్పుడుగా! సరదాకి."

ద్వారకనాథ్ లోపలికివెళ్ళి ఓ పుస్తకం కలం తీసుకొచ్చాడు.

"పుస్తకాల ఖరీదు పదివేల రూపాయలు; సరదా ఖరీదు పదివేల రూపాయలు. ఇందచెక్కు." అని ఇరవై వేల రూపాయలకి రాసిఇచ్చాడు. ఆనందరావుకి ఏం అనాలో, చెయ్యాలో తెలీలేదు.

"ఈ గొడవంతా యెందుకు, నా పుస్తకం యెక్కడ వుంటుందో చెప్పరాదూ?"

"పోయింది."

కవి పాపం. ఇరవై వేల రూపాయలంటే, తనకి గొప్ప అదృష్టం. కాని యెన్ని రూపాయలిస్తేనేం? తన చిన్ననాటి కవిత్వం. పైగా ఈ డబ్బు ఏ మొహం పెట్టుకుని తీసుకుంటాడు తాను?

"ఈ లోకంలో చెక్కులు వున్నాయన్నమాట" అన్నాడు.

'ఉన్నాయికాని ఆ లోకంలోకి వడితేనేగాని మారవు' అని నవ్వింది ఆమె.

టీ కాగానే "స్నానం చేద్దామా?" అని లేచాడు ద్వారకనాథ్.

"ఈ చెక్క నీ దగ్గిరే వుంచు" అని ఇచ్చేశాడు ఆనంద్.

ముగ్గురూ నది దగ్గిరికి వెళ్ళారు. అస్తమించేసూర్యుడు మెరిసే తెల్లని ఇసికకింది రేవు దగ్గిరికి నదిని లోపలికి చెట్ల మధ్యకి తవ్వి ఒక కోనేరు ఏర్పరిచారు. దానిచుట్టూ చలవ రాతి మెట్లు.

రెండురోజులు గడిచాయి ఇట్లా. మూడోరోజున వెడతానన్నాడు అతను.

రేపు వెళుదువుగానిలే అన్నారు వాళ్ళు. అతనికి వెళ్ళిపోవాలని గట్టిగా వుంది. వాళ్ళిద్దరిలో వాళ్ళిద్దరూ. ఎంతైనా తను వేరు. పైగా అంత శాంతం, అందం భరించ లేకండా వున్నాడు.

మళ్ళీ పుటకలు వుంటే, ఆ లోకపు చీదర లేనితనాన్ని అందాన్ని భరించలేకనే మళ్ళీ పుట్టాలని కోరుకుని ఈలోకం లోకి వొస్తారేమో జీవులు:

ఆ రాత్రి దొరైకన్ను అడిగాడు ఆనందరావుని—

"పుస్తకం పోతేపోయిందిలే, నీ కవిత్వం వినిపించు" అని.

"మరిచిపోయినాను."

"జ్ఞాపకం వున్నంతవరకు."

అక్కడక్కడ కొన్ని పాదాలు వినిపించాడు.

"ఇన్ని సంగీతవాయిద్యాలున్నాయి. ఆమె పాడరా?" అన్నాడు.

"ఎబ్బే! ఏమిటో ఉన్నాయి. అవి ఉపయోగించడం యెవరికీ చాతకాదు."

"ఆమె పాడరా పోనీ?"

"పాడతారు."

ఆమె తంబుర స్రుతిచేసుకుని పాడింది పూర్వకాలపు కీర్తనలూ, జావళీలూ... తాను మొదటిరోజున కలలో విన్న సంగీతమే. కాని ఆమెకంఠం ఇంకా పూర్వపు స్మృతుల్ని రేపుతోంది. ఆమె రెండుమూడు శ్లోకాలు పాడింది. తరవాత కృష్ణశాస్త్రిగారి...

"అన్వేషణ." తరవాత "సీపేరె నా రాజు, జపమన్న అపవాదు" అనిపాడింది.

తరవాత ఇంకెవరిదో కొత్త కవిత్వపు కీర్తన పాడింది. "ఆమెపాటలు సంధ్య నీడలు" అని.

ఎవరిదబ్బా ఆ కీర్తన చాలా మధురంగావుంది! ఆమె కళ్ళవెంబడి నీళ్ళు చెక్కిళ్ళమీదికి కారుతున్నాయి. కరిగిపోయినాడు కవి ఆమె పాటకే తగును ఆగీతం—

ఆరాగాల వూపులో ఊగి ఊగి.

ఆమె స్వరాల కూర్పులో, ఆగి ఆగి.

అని వినేప్పటికి ఒక కేకవేశాడు. అది అతని గీతమే. పూర్వం కళ్యాణి పాట విని అతను రాసిన గీతం. దాన్ని కీర్తన కిందచేసి పాడుతోంది.

ఆ కంఠం! ఈమే ఆ కళ్యాణి. తన స్వప్నాల సుందరి.

ఆమె పాటసీ, అతని జ్ఞప్తిని చాలా యెన్‌జాయ్ చేస్తున్నాడు దొరైకన్ను.

పాటకాగానే—

"కళ్యాణి, కళ్యాణి" అన్నాడు ఆనందరావు. తరవాత, "నాగీతం" అన్నాడు.

పారేసిన తన గీతాలకి, యెక్కడా యెవడూ వినీ గట్టిగా మెచ్చుకోని తన గీతాలకి ఇరవై వేల రూపాయలు చెక్కు రావడంతోటే, ఆనాటినించి తన గీతాలమీద అభిమానం ఎక్కువయింది కవికి. ఆమె పాడిం తరవాత ఒకొక్క గీతమే ఇరవై వేల రూపాయలకన్న విలువ గలది అనిపిస్తోంది.

ఆనందరావు ఆమెని కావిలించుకునేవాడే, అది వాళ్ళిద్దరూ వొప్పుకోరనిగాని. చేతులు నమస్కారం మల్లే ముడుచుకుని, గొప్ప ఎడ్మిరేషన్‌తో మాట్టాడకండా కూచున్నాడు.

"కళ్యాణి-నా కలలోని గాయకురాలు. నా మిత్రుడి భార్య అని తెలీదు నాకు" అన్నాడు. అనగానే జ్ఞాపకం వొచ్చింది. కళ్యాణి ధనవంతుడైన చెట్టియారుతో లేచిపోయిందని, దొరైకన్ను చెట్టియార్ కాదే! ఇద్దరి మొహాల వంకా చూశాడు, ప్రశ్నార్థకంగా. కాని ఇది భూలోకం కాదు. చచ్చిపోయి కలిశారు ఈలోకంలో వీళ్ళిద్దరూ.

దొరైకన్ను ఆనందరావుని తీసుకుని అడివిలో షికారు తిరుగుతున్నాడు. ఆ నిశ్శబ్దంలో చెప్పాడు తన కథ:

దొరైకన్ను భార్య చిన్నప్పుడే చచ్చిపోయింది. తనది చాలా పెద్ద ఆస్తి. పెద్ద వర్తకం. ఆనందరావుమల్లేనే కళ్యాణి పాటవిని ఆమెని కలుసుకున్నాడు. మోహించాడు. పెళ్ళి చేసుకుంటానన్నాడు. కాని ఆమె భర్త యెక్కడో ఇంకా బతికివున్నాడట. అతనినించి పారిపోయివొచ్చి మద్రాసులో దాక్కుని, ఏమీ చేతగాక, రేడియోవారి ధర్మంమీద బతుకుతోంది. పెళ్ళికాకండా పురుషుడితో సంబంధం చాలా అసహ్యం, భయం ఆమెకి. ఆమెని అనేక విధాల—పాటకచేరీలు, సినీమాకంపెనీలు, ఆస్తి, ధనం, ఇన్ని ఆశలు పెట్టాడు అతను. కానిఅవన్నీ ఇదివరకే చాలా మంది Offer చేశారంది. అతనికి వెర్రెక్కింది. మిత్రుడికింద ఆమెని చూస్తో ఉండనీమన్నాడు. కాని ఆతనినించి డబ్బు తీసుకోదు. ఏ Presents తీసికోదు. ఎప్పుడన్నా అతని ఇంటో టీతాగేది. కాని అతన్ని చాలా అనుమానంగా చూస్తోంది. ఎవడో తను చాలా దుర్మార్గుడని ఆమెకి చెపుతున్నాడని అతనికి తెలుసు.

ఒకరాత్రి అకస్మాత్తుగా తన యింటికి చాలా Perturb ఐ వొచ్చింది. తనని తీసుకోమంది ఏమరతులూ లేకండానే. ఆమె వెనకనే ఒక అతను వొచ్చాడు. రేడియో కారులో. తోట గేటుదగ్గిరే కలుసుకున్నాడు అతన్ని దొరైకన్ను. అతను భద్రయ్యట — కళ్యాణి అవసరంగా తనకి కావాలన్నాడు, యేదో రేడియో ప్రోగ్రాం సంగతి మాట్లాడడానికి. 'ఇంక రేడియోలకిరాదు ఆమె' అన్నాడు దొరైకన్ను. ఆమెతో మాట్లాడాలన్నాడు తను. తను లోప

లికి వెళ్ళి కళ్యాణితో చెప్పేటప్పటికి, "ఇక్కడికివొచ్చాడా? యెట్లా తెలిసింది!" అని వొణికిపోయింది. తనమీద సాడీలు చెపుతున్నవాడు భద్రయ్యేనని తెలిసింది. ఆ భద్రయ్య మూలానే ఆమె తనపాలబడ్డది, అని తెలుసుకునేటప్పటికి మొదటిదానికి ఆ భద్రయ్యని తన్నాలనీ, రెండోదానికి బహూకరించాలనీ, రెండూ ఒకసారే అనిపించాయి. ఇంతలో అతనే ప్రవేశించి దూకుడుగా 'కళ్యాణి' అంటున్నాడు. బైటికిపో అన్నాడు దొరైకన్ను. దొరైకన్నని తోసుకుని అతను...ఒక్కటి ఇచ్చుకున్నాడు అతనికి—కింద పడిపోయి నాడు భద్రయ్య. బూట్సుకాలుతో తన్నాడు. అతను పోగానే కళ్యాణి అతన్ని వేడుకుంది; మనిషి అనేవాడు కన పడనిచోటుకి, ఎవరికీ తెలీనిచోటుకి తనని తీసుకుని పొమ్మని. భర్త భయంకూడా వుంది ఆమెకి.

ఆ నదిమధ్య ఈ అడివి ద్వీపాన్ని కొని దాన్నిట్లా బాగుచేయించి ఆమెతో వొచ్చేశాడు. అవతల గట్టున ఒక ఏజెంటు తనకి కావలసిన సామానులు కొని పంపేందుకు, మద్రాసులో ఒక ఏజెంటు తనకి అవసరమైన డబ్బు పంపేం దుకు, మిగిలినడబ్బు ధర్మాలకి వినియోగించేందుకు. ఆ ఏజెంటుకి ఈ ఏజెంటుకీ మధ్య ఫోను. దాంటోనే చెప్పారు అతనికి ఆనందరావు చూడాలంటున్నాడని. దొరైకన్ను యెక్కడ ఉన్నదీ ఆ ఏజంట్లకి ఇద్దరికీ తప్ప ఇంకెవరికీ తెలీదు. వాళ్ళిద్దరు అక్కడ కాపరం ఏర్పరుచుకున్న తర వాత ఆనందరావే మొదటివాడు ఆ ద్వీపంలో కాలుపెట్ట

డానికి అని తన వృత్తాంతం చెప్పాడు ఆనందరావుకి. తరవాత చాలాసేపు మౌనంగా నడిచారు; చివరికి ఇంటివేపు.

కళ్యాణి తాంబురని అట్లానే ముందు పెట్టుకుని కూచుని వుంది. గర్భగుళ్ళో అలంకరించిన దేవతా విగ్రహం మల్లే. ఆమె కట్టుకున్న నీలంఅంచు సేలం పట్టుచీర పమిట గాలిలో చిన్నగా వూగుతూ ఆమెను తాకే ఆనందాన్ని అనుభవిస్తున్నట్టుంది. ఆమె పాదాల్ని కప్పి కుచ్చెళ్లు వాటిల్లో అవి నవ్వుకుంటున్నాయి. కబుర్లు చెప్పుకుంటూ, చుట్టూవున్న ఆ స్వర్గ రామణీయంలో స్వప్న స్వర్గాల్ని నిర్మించుకుంటున్నాయి ఆమెకళ్లు అనిపించింది ఆనందరావుకి. ఆమెని చూస్తూ కొంచెంసేపు నిలబడ్డాడు దొరైకన్ను. వాళ్ళనిచూసి ఆమె కదిలింది సోమరిగా.

దీపాల కాంతికింద కూచున్న ఆమెనించి ప్రయత్నంగా కళ్లు తిప్పుకుని, ఆనందరావు కేసి చూశాడు దొరైకన్ను.

"ఏమిటి అట్లా ఉన్నావు?"

"ఏం పని చేశావని?"

"నిజమే!" అని బిగ్గరగా నవ్వాడు. పెద్ద ఆశ్చర్యం ఆ నవ్వులో.

"నే నేదో చాలా ఘోరమైనదో బుద్ధితక్కువైన పనో చేశాననే!" అన్నాడు వెంటనే.

"అవును. నువ్వు ఇక్కడికి రాకండా అక్కడేవుంటే యుద్ధకాలంలో కోటీశ్వరుడి వయ్యేవాడివి. తెలుసునా? జైలుకికూడా వెళ్ళావుకాదూ, మధ్యలో చదువు మాని-

ఇంకేం? నిస్సందేహంగా మంత్రి వయ్యేవాడివి. ప్రధానివి కూడా అయ్యేవాడివి."

"మా నాన్నగారు గవర్నరు దగ్గర Executive Counsellor అప్పుడే అంత ఆస్తిని సంపాయించగలిగారు. ఆయన ఎంత సుఖపడ్డారో నే నెరుగుదును."

"ఇంకేం, ఎరిగేనా ఈ పని చేశావు? ఏం బతుకు ఇది? ఈమెకి మాత్రం ఆ సంగీతంతో ఈ పాటికి ఎంతకీర్తి?"

ఎంతధనం. యెంత ఔన్నత్యం? "సినీమాల్లో నే నటించి వుంటేనా!"

"నటిస్తే?"

"ఏం బతుకు ఇది? ఎవరికి ఉపయోగం? ఎవరు చూడను? ఎవరు మెచ్చను?"

"నువ్వా."

"నేనా!"

"అవును నువ్వే. ఎవరూ ఇంతవరకు కాలు పెట్టని ఈ ద్వీపంలోకి, నిన్ను ఆతురతతో ఆహ్వానించామంటే, నిన్ను ప్రజలనించి యెంత వేరుగా భావించివుంటామో ఆలోచించు."

"నేనేం వేరు?" అని దొరైకన్ను మాటల్ని తుడిచి వేసి తన ఆలోచనాధోరణిలోనే కొట్టుకుపోయినాడు ఆనంద రావు.

అట్లానే గొప్ప క్షణాలు జీవితంలో తటస్థించినప్పుడు, గొప్పకాంతికి కళ్లు తెరిచే గడపమీద మనిషినుంచునే

Opportunity కలిగినప్పుడు, ఇదివరకు బతికిన వీళ్ళబలుపు కళ్ళని మూసేస్తుంది. జీవితచక్రంసాగే పాతగాళ్ళ, చక్రాల్ని వొదిలి కదలనీవు. ఎగరనీవు. పెద్దపాపాలు నయం. మామూలు సగంచక్ర బతుకుకన్న, డబ్బు, మర్యాద, సంసారం, విలవల సారం లాగేనే, మొదడుమీద పాచి అట్టల్ని కప్పే దినదిన మామూల చర్యలుకన్న.

"ఏం వేరుగా భావించారు? ఏమీ నీతి నియమాలు లేని అమర్యాదస్తుణ్ణనా, లేక ఏమి అర్థంకాక, ఐశ్వర్యం చూసి కళ్లు భ్రమిసే తేలికమనిషినా?"

మనుష్యుల కళ్ళల్లో తన కవిత్వపు రోజుల చులకదనాన్ని మరిపించి, తాను ఒక ఘరానా కుటుంబీకుణ్ణని మనుష్యుల్ని impress చేసేందుకు అతను చేసిన పరిహారం—పలికింది. అన్నేళ్ళ ఘన ప్రయత్నమూ ఇంకా అంటు న్నాడు.

"మీ జీవితాలు మీకే సిగ్గు కాకపోతే వొంటరిగా పారిపోయి వొచ్చి యీ మూల ఎందుకు దాక్కుంటారు?"

ఆ మాటల్లో దౌర్జన్యమున్నా, కళ్యాణి ఆశ్చర్యమే కాదు, సిగ్గుపడి ఒకళ్ళముఖాలు ఒకళ్ళు చూసి తెల్లపోయి నారు. ఇంక తలెత్తి చూసుకోలేక, వొంచేశారు ముఖాల్ని. తన మాటలు బాగా పనిచేసి, వాళ్ళకి బుద్ధి చెపుతున్నా ననిపించింది కవికి.

"నువ్వే మంత్రివైతే నాబోటివాళ్ళకి యెంతమందికి ఉపయోగపడేవాడివి? యెంత హోదా! బతికినందుకు

యెంత ప్రయోజనం! ఎన్ని కొత్త సంస్కారాలు తీసుకు వొచ్చేవాడివి!"

"నా వంటివాడు అట్లాంటి గొప్ప కార్యాలు చేస్తాడని యెందు కనుకుంటావు?"

"పోనీ, నావంటివాడి సలహావల్ల, విపరీతమైన ధరలు, లంచగొండితనం, ఈ కార్మికులు ఇట్లా హక్కులకోసం అల్లరి చెయ్యడం—ఇవన్నీ ..."

"మీరేనా ఆ కవిత్వం రాసింది?" అని ఆయాస పడుతున్నట్టు అడిగింది, ఆమె.

"ఏం కవిత్వం?"

దొరైకన్ను అందుకున్నాడు!

"ఆమె పాటవిని ఆమె గాన మాధుర్యానికి, దేవతలు సువర్ణ పుష్పవర్షం కురిపించవొచ్చునని, ఏ లోకాధిపతి ఐనా, తన కిరీటాన్ని ఆమె పాదాలముందు అర్పించవొచ్చని,"

"అదా! అది కవిత్వం, చిన్నతనంలో రాసింది. అది అలంకారం. తెలిసిందా!"

"అవును, తెలిసింది .... మరి నువ్వు వెడతానంటున్నావుగా, రేపు పొద్దున్న వెళ్ళు."

"ఊఁ."

మర్నాడు తెల్లారకట్టే లేచాడు దొరైకన్ను. ఉషా కాంతులు తూర్పు నదీ ఎరుపులో ఏకమైనాయి. కొత్తగా ఆనాటికి విచ్చుకున్న జాజి, గోరింట, నారింజ పూల

పరిమళాల్లో 'టీ' తీసుకున్నారు. అప్పటికి ఆనందరావు ఆత్మ కొంచెం మేలుకుంటోంది.

"నేను కఠినంగా మాట్లాడానా ద్వారే, నిన్నరాత్రి! నేను చాలా నిష్ఠపట్టుణ్ణి. అనుకున్నది అనేస్తాను. మిమ్మల్ని offend చేశానేమో!"

"లేదు."

"అట్లా మాట్లాడడం తప్పంటావా?"

"ఎబ్బే! ఏం కాదు."

"నువ్వేదో బాగా లేవు."

"ఊఁ."

"మరి చెప్పరా? నావల్ల నేనా?"

"నీకుమల్లే నేను నిష్ఠపటిని కాను."

"ఆమాటంటే నే నొప్పుకోను. నా ఉద్దేశ్యం, నాకేమనిపించిందో నేను చెప్పాను కదా ఏ ఆలోచనా లేకండా—"

"అట్లా మాట్లాడినందుకు నీ అభేదత్వానికి చాలా మెచ్చుకుంటున్నాను. స్నేహం అట్లానే వుండాలి."

"పోనీ. నా మాటల్లో ఏం తప్పువుందో చెప్పపోనీ?"

"తప్పేంలేదు."

"మరి......."

"దృక్పథాల భేదం."

"నీ దృక్పథం ఏమిటి?"

"ఇదే."

అని తోటకేసీ, ఆకాశంకేసీ చూశాడు.

"నాదీ?"

"అదీ" అని నది అవతల వొడ్డుకేసి చూశాడు.

"అవును, అవును." అని నవ్వాడు ఆనందరావు.

గుంపులు గుంపులుగా పక్షులు ఎగురుతున్నాయి. సూర్యుడి మొదటియెండ కాలేజి చూర్ల మీద పడుతోంది. చెట్ల నీడల్లోంచి, వాళ్ళు వెడుతోవుంటే ఆ అడివి అతని కోసం దిగులుపడుతోందనిపించింది. వెళ్ళేప్పుడు తడుతోంది, ఆ ప్రదేశపు అపార సౌందర్యం; చచ్చిపోయేవాడికి మామూలు పాతలోకం ఎంత అందమో విషాదంగా కన పడ్డట్టు. తన మిత్రులకి తనమీద ఎంత స్వార్థంలేని ప్రేమో.

అతన్ని సాగనంపి దొరైకన్ను వెనక్కి తిరిగిచూడ కండా చెట్లలోకి చూస్తో వెళ్ళిపోయినాడు. పడవలో అంతా వెనక్కి వెనక్కి తిరిగి చూస్తోనే అన్నాడు. ఆనందరావు అత నికి తెలీకండానే లోపల అనిపిస్తోంది ఏదో గొప్ప అదృ ష్టాన్ని పోగొట్టుకున్నానని.

ఏజెంటు అతనికి వాళ్ళవూరికి తెల్లటిక్కెట్టు, కొని, రైలెక్కించింతరవాత తెలిసింది, మనుషులూ, రైలెక్కే ఆదుర్దాలూ, రైలు ఉద్యోగస్తుల మొహాలూ, పొగా, దుమ్మూ, ఈగలూ, కుటుంబాలూ, పిల్లల ఏడుపులూ వినే టప్పటికి-ఏమైపోయినాడో అతను. స్వర్గంనించి తోసేస్తే కిందపడ్డ నహుషుడిమల్లే ఐనాడు. ఏంతోచలేదు. వాళ్ళిద్దర్నీ

తలుచుకున్నాడు. ఈ మనుషులతో పోల్చిచూస్తే వాళ్ళల్లో దేవతల వర్చస్సు తోచింది. అతని కళ్ళముందు వాళ్ళ మొహాలు, వాళ్ళ స్మితం, వాళ్ళప్రేమ. వాళ్ళచుట్టూ కళావాతావరణం.

తాను ఇంటికి పోతున్నాడు. తన తోటివర్తకులూ, బేరాలూ, కొన్నివేండ్లు ఎక్కడికో ఇంకో లోకానికి వెళ్ళి నట్టుంది, అతని మనసు. ఎంత నష్టం? ఎన్ని బేరాలు పోయి నాయో! ఆ చెక్కునన్నా దాచుకున్నాడు కాదు తాను. ఇరవై వేలు! తన జన్మకి!

టికెట్టు కలెక్టరు వొచ్చాడు. టిక్కెట్టుకని చూస్తే జేబులో ఓ కవరువుంది. దాంటో వుత్తరం.

ఆనంద్,

మేమిట్లా ఐపోయినామని దిగులు పడుతున్నావా? ద్వేషిస్తున్నావా? మా ఈ స్థితికి నువ్వే కారణం, నీకవిత్వమే కారణం, నేనసలు కళ్యాణినికలుసుకోడానికి. నీపుస్తకం అచ్చు వేయిస్తో నీమీది ప్రేమవల్ల, నీ పద్యాల ప్రూఫులు నేనే స్వయంగా దిద్దాను. కళ్యాణి గానంమీద నువ్వు రాసిన పద్యాలు విని, ఆమెని వెతికి పరిచయం చేసుకున్నాను. మా ఇద్దరం ఎటువంటి వాళ్ళమైతేనేంలే. మేం కలుసుకోవడంవల్ల మానవులకి సాధ్యంకాని ఆనందాన్నందుకున్నాం. కాల మంతా ఒకగొప్పవెలుగై మమ్మల్ని మబ్బుల్నిమల్లే తనలో కరిగించేసుకుంది. నేను మంత్రినై, ఆమె తారనై, ఏదో ప్రపంచోద్ధరణ చేద్దుమని అన్నావు. ఇప్పుడు ప్రపంచోద్ధరణ చేసేమంత్రులూ తారలూ మావంటివారే. మేమేంప్రత్యేకం

కాదు. అదృష్టం ఒక్కసారే పిలుస్తుంది ఏ మనిషినైనా. ఆ పిలుపును గుర్తించగలిగినవాళ్ళు ధన్యులు. మా అదృష్టం ఎటువంటిదో మేం గుర్తించగలగటం దేవతానుగ్రహం. అంతకన్న నీ కవితానుగ్రహం.

నీ పుస్తకం మాదగ్గిరేవుంది. ఆ గీతాలు ప్రపంచం అంగీకరించదు. వాటి కర్తకూడా వాటిని అంగీకరించకండా disown చేశాడు. కనక అవి మావి, వాటివిలువ మాకే తెలుసు. ఏగొప్ప శుక్రుడో కొన్నాళ్లు నీ జాతకానికన్నా పట్టి వుండాలి. పూర్వజన్మంలో కొద్దికాలం నువ్వు రతీ సరస్వతీ పూజలన్నా చేసివుండాలి. వెలిగింది నీకలంలో అద్భుతశక్తి కొన్నాళ్లు. గుర్తులేకండా వొదిలిపోయింది.

కళ్యాణి హృదయంలో నువ్వు ఎంత గొప్పగా వెలుగు తున్నావో, నీకు తెలిపే వీలునన్నా ఇచ్చావుకావు. కాని నిన్ను చూడగానే అంది ఆమె నాతో 'ఇతను కాదు ఆ గీతాలురాసింది'' అని.

మమ్మల్ని కనుక్కోడానికి ప్రయత్నించకు. ప్రయత్నించి లాభంలేదు.

దీంటో పెట్టిన చెక్కులతో నీ గీతాల విలవని ఒక్క రవ్వ తీర్చుకుంటున్నాను. నేను చాలా ధనవంతుణ్ణి. ఆ డబ్బు తీసుకోవడానికి సంశయించకు. నా బాకీవాళ్ళకి ఫోను చేశాను. మార్చుకోడానికి ఇబ్బందేమీ వుండదు.

—ద్వారైకన్ను.

యాభై వేలరూపాయలకి చెక్కు. గబగబ ఏడ్చాడుఆనందరావు. ఆ చెక్కుని చింపే సాహసంలేక గుంజుకున్నాడు.

# ముక్కాలు పీట

రాత్రి హోటలుడాబామీద కూచుని నలుగురు సేట్లూ బెజవాడ పడమటి కొండలకేసి చూస్తున్నారు. ఎనిమిదైనా ఇంకా ఓలేతకాంతి కొండమధ్యనించి బెజవాడమీదికి చాచుకునే వుందనిపిస్తోంది. రైలుస్టేషన్ ఎర్రపచ్చ దీపాలూ తరువాత క్రమంగా ఎత్తవుతూ కొండమీదికి పాకే దీపాలవరసా చూస్తున్నారు ఎంత అందమూ అని. కృష్ణవంతెనమీది నించి రైలువస్తో, తెల్లనిచారని ముందుకు నెట్టుకుని వెళుక్కుంటోంది తోవ. వాళ్ళని భోజనానికి రమ్మన్న ఇన్స్పెక్టర్ రామరాజు అరగంట ఆలస్యంగా వొచ్చాడు.

"ఏమిటి ఆలస్యం" అన్నాడు, బాంబేనించి ఇద్దరు తోడిసేట్లని వెంటపెట్టుకు వొచ్చిన సింహాచలం.

"పోలీసు ఉద్యోగం. ఇవాళ..."

"ఎన్నిసార్లు చెప్పాలి. ఈపాడు పోలీసుఉద్యోగం నీకెందుకని? నా కర్మాగారంలో చిన్న మానేజరుకి అయిదు వందల రూపాయల జీతం.

"ఇతనిని నా Partner గా కూడా తీసుకుంటాను రమ్మన్నాను. ఇంతకంటె fool వుంటాడా?" అన్నాడు ఆ ఇద్దరు సేట్లతో సింహాచలం.

"కాని, డబ్బు సంపాదనలో ఈ ఉద్యోగములో వొచ్చే త్రిల్ వుంటుందా?" అన్నాడు రాజు.

"లేకేం? డబ్బు సంపాయించడాన్ని మించిన త్రిల్ లోకంలో లేదు. డబ్బే కాదు. కొత్తమార్కెట్లు, తక్కిన కంపెనీలతో పోటీ!" అన్నాడు సింహాచలం.

"నీ కొక్కడికి త్రిల్, వేలమందికి వృత్త బండచాకిరీ, నీ కర్మాగారంలో."

"వాళ్ళకిమాత్రం? నువ్వు పట్టుకునే దొంగలకి నిన్ను తప్పించుకునే త్రిల్ లేదంటావా?"

"వుండేమోలే. దొంగలకి భయం, కార్మికులకి దరిద్రం."

"అందుకనే పరిశ్రమలు జాతీయం చెయ్యడం చాలా మూర్ఖమంటాను!" అన్నాడు ఒక సేట్ అసందర్భంగా.

"రష్యా సంగతేమిటి?"

"రష్యాఐనా అంతే. ప్రస్తుతం ఏవేవో ప్రయత్నాలూ, కలలూ, ఎంతకాలం? అదిగాక యుద్ధాలు వొస్తాయని త్రిల్, అవిపోనీ, జీవితంలో ఇన్‌టరెస్టు పోతుంది."

"సరేకాని, నీ ఆలస్యానికి ఏదో కారణం చెబుతున్నావు?"

"అవును, మనవూరు కొత్తరైల్వే ఇంజనీరు లేడూ దొరస్వామి, అకాత్తుగా మధ్యాన్నం ఆతనిగదిలోకి ఒకామె వొచ్చింది. ఎవరో తెలుసా? రాజగోపాలాచారి కోడలు. వొచ్చీ రావడంతో కుర్చీలో కూచున్న అతనిమెడను కావిలించుకుని ముద్దుపెట్టుకుంది. దొరసామి అందమైనవాడు. అతన్ని మొన్న తులాభారం నాటకంలో చూసిందట.

మొగుడు ఆమెని మొగాళ్ళలోనే కూచోపెట్టుకుంటాడుగా! పైగా తన సొంతకారులో తనే డ్రైవ్ చేసుకొంటూ వెళ్ళిందట ఆఫీసుకి. హడలిపోయినాడు అతను. బల్లకీ కుర్చీకీ మధ్య దూరి అతని వొళ్ళోకూచుని మెడచుట్టూ చేతులేసి ముద్దులాడుతోంది. అతనికి ఎదురుగా పెద్దకిటికీలోంచి గుమాస్తాలు కనపడుతున్నారు ఇదంతా చూస్తో. అతను లేచి, వొచ్చీరాని తెలుగులో 'ఎవరు? ఎవరు?' అని అరిచాడు."

"నువ్వు నా భర్తవి. నువ్వే అసలు భర్తవి. నాకు దేవి చెప్పింది. నీ భార్యని పంపించెయ్. ఆఫీసు ఐపోగానే మన ఇంటికి పోదాం" అంది.

"పిచ్చిదా! అదేమన్నా వేషమా? మోసమా? పాపం అతను గుమాస్తాల్నీ బంట్రోతుల్నీ పిలిచి ఏమిటో కనుక్కోమన్నాడు. వాళ్ళతోనూ అదేమాట. వాళ్ళు ఆమెని గుర్తించి భర్తకోసం పరుగెత్తారు." అని ఆగాడు రామరాజు.

"అటు పోతున్న Prof: జగన్నాయకులు వాళ్ళని చూసి దగ్గిరికి వొచ్చి నుంచున్నాడు.

"రాజగోపాలాచారి కోడలు సంగతేనా? చాలా చిత్రం" అన్నాడు జగన్నాయకులు.

"ఆ భర్త వొచ్చేలోపల చాలా అల్లరిచేసింది ఆమె! తన జాకెట్టు తీసెయ్యడం, అతనికోటు లాగెయ్యడం ఇట్లాంటివి. ఇంక ఆమె ప్రేమప్రదర్శనం, మోహం చూసితీరవలసిందేట."

"ఆమె అందంగా ఉంటుందా? యవ్వనవతా?" అన్నాడు పికసేటు.

"చాలా"

"అందరిలో ఆఫీసులో జరిగిందిగాని వొంటరిగా జరిగితే ఈ గొడవే లేకపోను. ఆ ఇంజనీరు తెలివిగలవాడైతే చల్లగా జాగ్రత్తగా ఏర్పాట్లు చేసుకునేవాడే" అన్నాడు రెండో సేటు.

"మీకా అదృష్టం రాకపోయిందనే దిగులా ?"

"నిస్సందేహంగా, నేనైతేనా ఆఫీసులోనైనా సరే, చాలా చక్కగా manage చేసేవాణ్ణి."

"తరువాత ?"

"భర్త వొచ్చాడు. వొస్తే ఆమె చాలా స్పష్టంగా శుభ్రంగా మాట్లాడింది. 'ఇంక మీకూ నాకూ సంబంధం లేదు మీరు నాకు భర్తేమిటి ? వేరే పెళ్ళిచేసుకోండి. ఇంక ఈయనతో నేను చాలా గొప్పస్వర్గం అనుభవించబోతున్నా'నని. లాక్కెళ్ళారు కారులో పడేసి ఆమెని భర్తా వాళ్ళూ. రేపణ్ణించి ఏమవుతుందో చూడాలి."

"ఆమె ఇదివరకంతా మామూలుగానే వుండేదా ?"

"మళ్ళీ యింటికి వెళ్ళింతరవాత మామూలుగానే వుంది. అక్కణ్ణించే వొస్తున్నాను, డాక్టరుతో మాట్లాడుతూ వుండిపోయి."

"అందరూ ఏమంటున్నారు ?"

"ఏమైతేనేం చాలా ఇన్ట్రెస్టింగా వుంది"

"ఆ మాత్రం ఏదో ఈవెన్టు జరక్కపోతే జీవితం చాలా డల్‌గా వుంటుంది."

"కొందరు మనుషులే ఈపెస్టు. నోరి వెంకటేశ్వర్లు బతికివుండవలసింది. ఈ వ్యవహారంమీద అతని కామెంట్సు వినడం ఒక ట్రీట్. అతను పోయింతరువాత మనవూరు ఎంత చిన్నపోయింది ?"

"గోపాలరావు వెళ్ళిపోయిం తరవాతో ?"

"నిజమే."

"ఈ సంగతిని గురించి మీ అభిప్రాయ మేమిటి ?" అని అడిగారు మనోశాస్త్రవేత్తని జగన్నాయకుల్ని.

ఈ జగన్నాయకులు ఎట్లానూ వొదలడు, భోజనం పెట్టిందాకా అనుకున్నాడు రామరాజు.

"ఇది temporary mental aberation."

"ఏదన్నా గ్రహమేమో ?"

"గ్రహాలూ, భూనడాలూ, దెయ్యాలూ అన్నీ అంతే."

"Sub-conscious disturbance."

"Stock theraphy అది. ఇదేమిటి ? ఇంతకన్న చిత్రమైనది మొన్ననే జరిగింది చెబుతాను వినండి."

ఎట్లాగూ వొదలడు. భోజనం పెట్టిందాకా చెబుతోనే వుంటాడు. ఏంచేస్తాం ? అనుకున్నాడు రామరాజు.

"గోవిందరాజులు కలకత్తానించి శెలవమీద సొంత వ్యవహారాలు చూసుకోడానికే తణుకు వచ్చాడు. అతని అన్నగారి ఇంటో అన్నకూతురు సులోచనన్ని చూసి.

"ఎప్పుడు వొచ్చింది అత్తవారింటినించి ?" అని అడిగాడు.

సులోచనని శ్యామరావుకి ఇచ్చారు. అతను నెల్లూరులో గొప్పవకీలు. మొదటిభార్య ముప్పైఏళ్ళకేపోయింది సులోచన తరువాత భార్య.

"అయ్యో! సులోచనకి అత్తవారిల్లు కూడాను" అని ఏడ్చింది అతని వొదినగారు.

"ఏమిట్రా అన్నయ్యా, శ్యామారావు పోయినాడా?"

"పోయినా పీడా వొదిలిపోను. శ్యామారావు సులోచనని తీసికెళ్ళాడు. అంతే ఏంలేదట. మొదటిభార్య దుర్గ ఫొటోని పెద్దదిచేయించి వేళ్ళాడకట్టాడు ఖద్దరు దారాలతో. ఈ రెండో పెళ్ళాం పని-పొద్దున్నే అతనితోకలిసి ఆ ఫోటోకి పూజలు చెయ్యడం, దణ్ణాలు పెట్టడం. ఇది ఎవరితో చెప్పు కుంటుంది? వీలైనప్పడల్లా దుర్గని పొగిడి ఆమె ఆదర్శమని, ఆమెతో పోల్చి దీన్ని సిగ్గుపర్చడం. ఇప్పుడు ఆ దుర్గ ఓ దేవత. అన్ని సుగుణాలూ పాతివ్రత్యాలూ గొప్పదనాలూ అన్నీ ఆమెవే. పొద్దస్తమానం వొడకాలి. ఎందుకంటే, దుర్గ ఖద్దరు ధరించేది. ఆ దుర్గ సంగతి మన కెవరికీ ఏమీ తెలీనట్లు. ఓసారి పండక్కి వొచ్చినప్పుడు సులోచన ఏడ్చింది. నేనువెళ్ళి అతన్నే ప్రశ్నించాను. ఈ విషయంలో మాత్రం మనమనిషి కాడు అతను. తక్కిందంతా బుద్ధిమంతుడూ స్వార్థపరుడూ. తనెట్లా బాగుపడాలో బాగా తెలుసు. మంత్రి అయ్యే ఛాన్సుకూడా వుంది. అడిగితే "నా మొదటి భార్య కలవుకాలే దంటాడు. దేనికి? రెండోభార్యతో కాపరానికి. ఏంమాట్లాడినా అదేమాట?"

"చాలా చిత్రంగావుందే. వుండు, నేను మద్రాసు వెళ్ళేప్పుడు దిగి కనుక్కుంటాను. వాడు నేనూ కలిసి చదువుకున్నాంకదూ ?" అన్నాడు గోవిందరాజులు.

భోజనం దగ్గర సులోచనను పరిహాసమాడాడు, సవితి ఫోటో పూజసంగతి.

"చిన్నాన్నా ! నాన్న చెప్పినకారణం ముఖ్యమను కోకు. అదిసరేలే. ఆ పూజలూ, ఆ దుర్గమహాత్మ్యాలూ, పాతి వ్రత్యాలూ, ఆదర్శాలూ, ఆ ఉపన్యాసాలు వింటోవుంటే ఆ ఫొటోని కిందికిలాగి, బద్దలుకొట్టి ఆయన నెత్తిమీద విసిరి కొట్టాలనిపిస్తుందనుకో. ఏంచేసినా ఆ ఇంటో నిలవటం కష్టం."

సులోచన అందమైనది; చదువుకున్నది, తెలివయింది.

"సరేలే నేను వెళ్ళి మాట్లాడి వొస్తానుకదూ ?"

"మాట్లాడితే మాట్లాడులే. కాని నే నక్కడికి కాపరానికి వెళ్ళేది వుత్తది."

"అదేమిటి ?"

"అంతేలే. 'అదేమిటి ?' అంటావు. నీకేం ? అందుకనే మొగవాళ్ళకి ఇంతబుద్ధి లేదేమా అనుకుంటాము. అవేవో షరతులు పెడతావు. వొప్పిస్తావు. కాని ఆ మనిషి, ఆ మనసూ ? అదేం చేస్తావు ? ఒకపిచ్చి అనుకో. ఓ ముక్కాలుపీట పెట్టారు. దాంటోంచి ఆమెరోజూ సందేశాలు పంపుతుంది. ఆ ప్రకారం జరిగించి తీరాలి. ఓరోజు 'ఈరాత్రి మేలుక్కూచో' అంటుంది, ఆ మాటతో ఇంట

ఎవరికీ నిద్రవుండదు. ఓరోజు 'శాబూలు అపీలున్న కావాలి' అంటుంది. ఇంక కొన్నివారాలు వాటికోసం ప్రయత్నం. 'సులోచనని కొప్పుపెట్టి పసుపు పూసుకుని, నీలంఖద్దరుచీర కట్టుకుని కనపడమను' అంటుంది. ఓరోజు 'దిసిమొలగా కూచోమను' అంది. అంతే. ఆ ఆజ్ఞ కూడా పాలించవలసిందే

"బావుంది."

శ్యామూరావు బుద్ధిహీనుడు కాడు. తనేమో డబ్బు సంపాదనలోవుండి భార్య దుర్గని స్వదేశోద్యమంలో ప్రవేశ పెట్టాడు. ఎటువచ్చినా నష్టపడకుండా వుండడానికి. ఆమె రెండుసార్లు జైలుకు వెళ్ళింది. ఆటుతరవాత తిరగడం రుచి మరిగి ఇల్లు పట్టకుండా ఉద్యమంలో పనిచేసింది. ఇంకేం అందమైన ఆడ ఆమెకిరావలసిన అపవాదులో నిజంవాటిలో బోలెడు వొచ్చాయి. చివరియిద్దరు పిల్లలకీ శ్యామూరావు పోలికలే లేవు. ఈనాటి ప్రసిద్ధనాయకుల ఇద్దరిపోలికలు అచ్చుగుద్ది వున్నాయి మరి. పాపం పుణ్యం భగవంతుడికి తెలియాలి. ఎట్లాఅయితేనేం, ఆమెకి జబ్బుచేసింది. జైలు వల్లా ఉద్యమ ఉష్ణతవల్లా ఆరోగ్యం బలిఅయిందన్నారు. ఆమాట నిజమే. ఉద్యమంలో వాళ్ళవల్ల పట్టుకున్న రోగాలే అవి. చివరికి చచ్చిపోయింది. చచ్చిపోతుందనగానే శ్యామూరావు ఆమెకి చాలాఫొటోలు తీయించాడు. దహన సంస్కారానికి గొప్ప ఊరేగింపు జరుగుతుంది రమ్మని నాయకులకి టెలిగ్రాము లిప్పించాడు. పత్రికల్లో ఫొటోలతోసహా ప్రకటించాడు. చచ్చిపోయినాక అందర మతాలవాళ్ళచేతా ప్రార్థనలు చేయించి అస్థులకి పూరిచందాలమీద గొప్ప

సమాధి కట్టించాడు చలవరాతితో. ఆ తరవాత నాయకుల అభిప్రాయాలు తీసుకొని ప్రతి పత్రికలో ప్రకటించాడు. కవుల్ని బతిమాలి డబ్బుపెట్టి పద్యాలు రాయించి పుస్తకం వేయించాడు. దేశంమీద చందాలు వేయించి, ఆమెపేర ఒక నేషనల్ పాఠశాలా, ఒక ఆయుర్వేద ఆస్పత్రీ పెట్టించాడు. అంతవరకు తెలుసు చరిత్ర గోవిందరాజులకి. ఇప్పుడు ఈ కొత్త విశేషం. మధ్య మధ్య బంధువులకీ నాయకులకి ఉత్తరాలు వెడుతో వుంటాయి–దుర్గాదేవి సందేశం అని పైన రాసి.

"ఈ వారంలో గవర్నరు జనరలుతో రాయబారం పెడితే అనుకూలిస్తుంది." దుర్గాదేవి ఆజ్ఞ.

"మీ అబ్బాయి జరం త్వరలో నయంగా వుంటుంది." దుర్గాదేవి ఆజ్ఞ.

"మీ భార్య రహస్యంగా వ్యభిచరిస్తోంది." దుర్గాదేవి ఆజ్ఞ.

"అష్టమినాడు ఉత్తరాన తుమ్మచెట్టుకి మేకుకొడితే మీకు అదృష్టం" దుర్గాదేవి ఆజ్ఞ.

"మంత్రివర్గం వెంటనే రాజీనామా చెయ్యండి" దుర్గాదేవి ఆజ్ఞ.

"అర్జెంటీనా సహాయం అభ్యర్థించండి" దుర్గాదేవి ఆజ్ఞ."

ఇట్లాంటి ఉత్తరాలు రోజూరోజూ దశదిసలకి వెడుతో వుంటాయి. ఇంగ్లీషు గవర్నర్లకి కూడా వెళ్ళేవి.

"పందిమాంసం తినడం మానెయ్యండి" దుర్గాదేవి ఆజ్ఞ.

"మీారు మెసిపిటోమియాసించి లేచిపొండి." దుర్గాదేవి ఆజ్ఞ.

"సైన్యాధిపతిని బదిలి చెయ్యండి" దుర్గాదేవి ఆజ్ఞ.

"రామ్మేస్మేగ్గనాల్లు కూతుర్ని హైదరాబాదు నవాబు బావమరిదికిచ్చి పెళ్ళి చెయ్యండి."దుర్గాదేవి ఆజ్ఞ.

గోవిందరాజులు మద్రాసు వెడుతూవుండగా రైల్లో కోసలరావు కనపడ్డాడు. అంతకన్న కావలసిందేమని కోసల రావుతో శ్యామారావు ప్రస్తావన తెచ్చాడు గోవింద రాజులు. "శ్యామారావు పని చాలా ఆశ్చర్యం. చదివ్చిన భార్యని తన ఘనతకి బాగా ఉపయోగించుకున్నాడు. కాని ఇప్పుడు ఆ భార్య దెయ్యమై అతన్ని లొంగతీసుకుంది. ఆ ముక్కాలుపీట వ్యవహారం చాలా సీరియస్‌గా సిన్సియర్‌గా నమ్ముతున్నాడు తెలుసా! అతనుపంపే ఆ సందేశాలు అన్నీ చాలా వాస్తవమైనవని" అన్నాడు కోసలరావు.

"నిజంగా ఆ లోకంనించి వొస్తున్నాయంటావా!"

"ఏ లోకంనించి వొస్తున్నాయో, ఈ లోకంనించే వొస్తున్నాయో! అతనికి నిజంగా వొస్తున్నాయి. అతను నిజమని నమ్ముతున్నాడు."

"సరేలే. కాని పర్యవసానం చూడు."

వుండు. నువ్వు వెళ్ళు. నేనో తమాషా చేస్తాను. దాంతో ఈ పిచ్చి కుదిరిపోతుంది. నువ్వు వెడుతున్నావుగా.

ఒక్క వారంరోజులు అక్కడే అతని ఇంటో నేవుండు ఏం జరిగినా చూస్తోవూరుకో."

"నువ్వు చెయ్యిచేసుకుంటే అపజయం ఎందుకుంటుంది ?"

గోవిందరాజులు వెళ్ళేప్పటికి, శ్యామారావు ఇల్లంతా దెయ్యాలు తాండవిస్తున్నాయి. ఆ ఇంటో బతికినవాళ్ళ కన్న చచ్చినవాళ్ళెక్కువగా తిరుగుతున్నారు. ఒక్కగంట నిలవడం కష్టమనిపించింది. కాని తప్పదుగా! గోవిందరాజులు వూరికే స్నేహంగా మాట్లాడి వూరుకున్నాడు. ఏ వ్యవహారం ఎత్తలేదు. మొదటిరోజే ముక్కాలుపీటని అడిగాడు గోవిందరాజులకి సందేశం ఇమ్మని. "పెన్నలో మునిగి వెంటనే చావమనండి" అని వొచ్చింది ఆజ్ఞ.

మూడోనాడు పొద్దున్న ఒక యురపియన్ ఆమె వొచ్చింది శ్యామారావుకోసం. ఆమె పేరు మేడెం జూలియా. ఆమె విఖ్యాత "మీడియం" ఆమెద్వారా వచ్చిన యూరపు ప్రాముఖ్యులు, పరలోకాల రహస్యాలుఎన్నో వెల్లడిచేశారు. ఈ లోకపు స్పిరిట్యుయలిస్టులకి. ఇండియా దేశంలో పరలోక సంబంధాలు ఎక్కువగా ఉన్నాయని విని, వాటిని ఆమె తెలుసుకోడానికి వొచ్చింది ఇండియాకి. ఎవరో మద్రాసులో శ్యామారావు పేరు చెప్పారు. అందుకని వొచ్చింది నెల్లూరు.

శ్యామారావు ఉబ్బిపోయినాడు. ప్రతిరాత్రీ తన ముక్కాలుపీట మీటింగులకిరమ్మని ఆమెని ఆహ్వానించాడు. తనకి ఇన్‌టర్‌నేషనల్ Fame వొచ్చిందని సంతోషించాడు.

రాత్రి శ్యామారావు ఇంటో చాలామంది చేరుతో వుంటారు. కొందరు ముక్కాలు బల్లలో నిజంగా ఇన్టరెస్టు వున్నవాళ్లూ, కొందరు పొద్దుపోవడానికీ. ఆరాత్రి ముక్కాలు బల్లనించి సందేశాలు రాసుకుంటోవుండగా మేడెం జూలియా అకస్మాత్తుగా గుడ్లు తేలేసింది. మనిషంతా వొణికింది, ఇట్లా ప్రారంభించింది మాటలు:

"నేను, నేను, ఇన్నాళ్ళూ మీ ముక్కాలు బల్లని కదిపే నేను దుర్గని కాదు. నేను సూరమ్మని. మీ అక్కని. దుర్గ నరకంలో వుంది-దుర్గని ఇట్లా స్వేచ్ఛగా రానీరు. ఇన్నాళ్లూ దుర్గనని నటించి మిమ్మల్ని మోసంచేశాను. ఇవాళ నా మోసాన్ని కనిపెట్టగలిగిన శక్తిగల ఆమెవొచ్చి నన్ను బయట పెట్టింది. అన్నయ్యా, నువ్వు దుర్గను నమ్మావు. చాలాగొప్ప పతివ్రత అని ప్రపంచానికి చాటావు. నువ్వు దుర్గ పేరుని నీ ఘనతకి ఉపయోగించుకుంటున్నావు. నువ్వు నీచమానవుడివి. కాని నీమీది ప్రేమవల్ల నేను దుర్గ రూపంలో నీకు నచ్చేట్టు నాటకం ఆడాను, నిజం చెపితే కృశించిపోతావని. కాని ఇవాళ నాకన్న గొప్ప శక్తితో ఈమె నన్నిడ్చుకొచ్చి నాచేత నిజంమాట్లాడిస్తోంది. దుర్గ వుత్త జారిణి. వొక్కరితో కాదు, తన స్నేహితులతో, నీ స్నేహితులతో, అడగనివారిది పాపం. నీకూ తెలుసు లోపల. కాని నువ్వు కళ్లు తెరవ తలుచుకో లేదు. నవ్వుల పాలవుతావనీ నీకు కీర్తినీ గొప్పతనాన్ని సంపాయించి పెడు తోందనీ. దుర్గ నరకానికి వెళ్ళింది. నిన్న వెళ్ళి చూశాను. దుర్గని, నీతో ఈ మాటలు చెప్పమంది. అంత అనుభ

వించినా తనకి మొగవాళ్ళమీద కోర్కె పోలేదట. తన శరీరం ఇంకా కామతృప్తి కావాలంటోందిట. ఆ తృప్తి తీరనంతకాలం, ఆ వాంఛ తీరనసంతకాలం తనకి నరకం లోంచి విముక్తిలేదట. ఆతృప్తి నీవల్లనే రావాలి. మరి భర్తవుకదా! మాలోకవాసులకి పుత్రులవల్లా, భర్తలవల్లనే సహాయం జరుగుతుంది. ఇంకెవరూ పనికిరారు. కనక నిన్ను వెంటనే ఓస్త్రీని సౌఖ్యపెట్టమంది. నువ్వు అనుభవించే స్త్రీని ఆవహించి తాను తృప్తిపడుతుందిట. అదే దుర్గ కడసారికోరిక. ఇంక నాపని అయిపోయింది. నేను వేరే జన్మకి వెళ్ళిపోతున్నాను. ఇంకరాను" అని చెప్పి, మేడెం జూలియా వెనక్కి విరుచుకు పడిపోయింది. శ్యామలరావు నోటమాటరాలేదు. సభాసదులు చెల్లాచదురైనారు.

మర్నాడు మేడం జూలియా ఎక్కడా కనిపించలేదు. శ్యామారావు మూణ్ణెల్లు మంచంపట్టాడు. అంతటితో అతనికి ముక్కాలుపీట పిచ్చి వొదిలింది. దుర్గ నామ ప్రచారం మానేశాడు. సలక్షణంగా ప్లీడరీ చేసుకుంటూ, బాగా సంపాయిస్తూ కాపరం చేస్తున్నాడు—తనని అస్పత్రిలో దయగా చూసిన నర్సు నరసమ్మతో.

కోసలరావు గోవిందరాజులకి రెండువందల యాభై రూపాయలకి బిల్లు పంపాడు. బిల్లు చెల్లించుకుంటూ గోవింద రాజులు కలకత్తాలో కోసలరావుతో—

"మరి ఏం జరిగినట్టు? సులోచనకి ఏం ఉపకారం జరిగింది?" అన్నాడు.

"సులోచనకి వాడేమిటి? తండ్రికి బుద్ధిలేక పెళ్ళి చేస్తే నాకు బుద్ధిలేదూ! సులోచనసంగతి నేను చూస్తాలే, 'డైవర్సుబిల్లు' ప్రవేశపెట్టించాను మన కాశీశ్వర్రావుచేత" అన్నాడు.

"మరి ఈ గలభాఅంతా ఎందుకు చేయించావు? శ్యామారావు ఏమైతే మనకేం!"

"సైకలాజికల్ ఇన్‌టరెస్టు"

"నాఖర్చుతో" అని మూలిగాడు గోవిందరాజులు.

—...—

# మర్యాదస్తునికో కథ

దక్షిణ ఇండియా తారల్లోకల్లా ప్రసిద్ధతార కుసుమ కుమారి. ఆమెని తెరమీద చూడనికళ్లు, ఆమె పాటని వినని చెవులు, ఆమెని చూచి పిని చప్పట్లు కొట్టని చేతులు, ఆమెని స్తుతించని నోళ్ళు, ఆమె చిత్రప్రదర్శనాలవేపు నడవని కాళ్ళు మనుషులకి చాలా అనవసరమని పద్యాలు రాశారు నవీన పోతన్నలు. అంతేకాదు ఆమె పత్రికల్నికొనని ధనం ధనంకాదనీ, ఆమెమీది Scandals చెప్పుకోని క్లబ్బులు క్లబ్బులుకావనీ, ఆమెపద్ధతిని అలంకరించుకోని స్త్రీలు స్త్రీలుకారనీ, ఆమెని హృదయంలో కావిలించని పురుషులు పురుషులుకారనీ, ఆమె నామ సంకీర్తనం జరగని గృహం గృహంకాదనీ, ఆమెకి సన్మానం చెయ్యని పట్టణం పట్టణం కాదనీ కూడా సీసపద్యాలు రాశి చివరకి ఆమెపైన పద్యాలు రాయని కవి కవికాదన్నారు. ఆ అపనింద కథకులపైకికూడా వొచ్చేట్టు కనపడి భయంతోముందే ఈ కథ రాసేస్తున్నాను అన్నాడు ఆంధ్ర కథకుడుగా ఆచంద్రార్కం అద్భుతమహిమతో ఆరాధింపబడాలని ఆశించే ఈ కథక రాజన్య చూడామణి.

కుసుమబాల గత పదిసంవత్సరాలనుంచి ఆంధ్ర, తమిళ, కర్నాటక, మళయాళ, కన్నడ, హిందీ, సాంఘిక జానపద, చరిత్రాత్మక, భక్తి, సంస్కారిక, సంసారిక

చిత్రాలలో ప్రధాన నాయకిగానే నటించింది. అన్ని భాషల లోనూ, ప్లేబాక్ లేకుండా కర్నాటక, హిందీ బాణీలలో, శాస్త్ర, సినిమా, నవీన, భరతమాత, భర్తమాత, తెలుగు మాత, తమిళమాత, తన సొంతమాతల కీర్తనల్ని పాడింది.

ఆమె వివాహానికి సమస్త సినీమా కళాప్రపంచం హాజరయింది. ఆ పెళ్ళి చాలా ఆలస్యంగా, అనవసరంగా జరిగింది. వరుడు ఎవరో చాలాకాలంనించి అందరికీ తెలుసు. ఆమె చిత్రాల డైరెక్టరు సంజీవరాయుడు. అతను ఆమె చిత్రాల డైరెక్టరు కావడానికి అతని అర్హత, పదేళ్ళనుంచి ఆమె శయ్యా భాగస్తుడు కావడం. యోగ్యత ఆమె సినిమా కంపెనీ షేర్ల భాగస్తుడు కావడం! ఆమెకి వొచ్చిన పెళ్ళి బహుమానాలతో మద్రాసునగరంలోని బట్టలషాపులూ, నగలషాపులూ పాతసరుకు తీసేసి ఆ బహుమానాలతో నింపవొచ్చు.

గొప్పడిన్నరు ముగిసేటప్పటికి ఇంకా రాత్రి తొమ్మిది గంటలే. సినీమాల ఆర్కెస్ట్రాలూ, పాటకులూ, హాస్యనటకులు చేరిన తరువాత ఏమేం ప్రోగ్రాములు వుంటాయో తెల్లవార్లూ అనుకున్నారు. అతిథుల్ని ఒక పెద్ద హాలులో ఆసీనుల్ని చేసి సంజీవయ్య వాళ్ళని ఎడ్రెసు చేశాడు.

"ఈ శుభసమయంలో మిమ్మల్ని వినోదపరచడానికి నాకు ప్రత్యేకమైన పద్ధతి తోచింది. పాటకచేరీలు మొదలైనవి చాలా మామూలు. మనం రోజూ అవస్థపడే పాటల్ని వాళ్లు ఇక్కడ వినిపించడం పాతకం. ఈరాత్రి

మీకు ఓకథ చెప్తాను. అది ఈనాటి వధూవరుల ప్రణయ గాథ—లేక అప్రణయబాధ—లేక జీవిత శోధ, కాకపోతే ప్రణయ మరణబోధ" అని ఆగాడు.

సంజీవరాయుడు చాలా ప్రేమాస్పదుడు. గర్వమూ ఈర్ష్యా లేని మనిషి. ధర్మపరుడు, కష్టంలోవున్న సోదరుడికి వెంటనే ఆలోచన లేకుండా చెయ్యి అందిస్తాడు. కనక ఎవరికీ అతనిమీద ఈర్ష్యగాని ద్వేషంగాని లేదు. అతను చెప్పేకథని చాలా కష్టంతో విన నిశ్చయించుకున్నారు అక్కడ కూడినవాళ్ళు.

"నా వయస్సు! ముప్పైఎనిమిది. కుసుమ వయస్సు నే నెరుగుదును. కాని ఇప్పుడు చెప్పానంటే సాయంత్రంలోగా విడాకుల దరఖాస్తు పడుతుంది. కనక ఆమెవయస్సు పత్రికల్లో ఆరేళ్ళనించి ప్రకటిస్తున్నా ఇరవై ఏళ్ళనంటాను. ఆమెకి ఇప్పుడు ఇరవై ఏళ్ళైతే ఆమె సినిమాల్లో తన పదో ఏటనే చేరివుండాలి. అనే ప్రశ్నని మీరందరూ మాకు వినపడకుండా తర్కించుకున్నదేగనక, నే నంతకన్న ఏమీ చెప్పనక్కర్లేదు.

ఈ వివాహం జరగడానికి వీలును కల్పించిన అయ్యాదేవర కాళేశ్వరరావుగారికి నమస్కారంతో ఈకథని ప్రారంభించకపోతే చాలా కృతఘ్నుల మౌతాము. మూర్ఖుడు వివాహాలు చేసుకోతలుచుకున్నవారు. ముందే ఎట్లా సంసిద్ధులు కావాలో ఆయన బిల్లులో సూచించి మనకందరికీ కృతజ్ఞతాపాత్రులైనారు. అదేగాక మీరందరూకూడా

మాకు కృతజ్ఞులు కావాలి. ఎందుకంటే మాది, భవిష్యత్ సూచకమైన పయనీర్ వివాహం. మీ అందరికీ ఆదర్శప్రాయం. త్వరలోనే మీరందరూ మమ్మల్ని అనుకరిస్తారనీ, ఇప్పుడు కుర్చీలలో కూర్చున్న జంటలు, కొంతమందైనా, ఈసారి ఇట్లా ఓ శుభకార్యానికి కలుసుకునే లోపల స్థలాలు మార్చుకునే యోగ్యతని న్యాయశాస్త్రరీత్యా సంపాయించుకుంటారనీ ఆశించడం కాబోదని విశ్వసిస్తున్నాను.

నేను చెప్పబోయే కథలో అతను 'అంట్లే' సంజీవరాయుడు. ఆమె—అంటే కుసుమకుమారి. ఈనాటినించి ఆమె కుసుమదేవి. ఇదివరకుకూడా శరీరరీత్యా కుమారి కాదనుకోండి. ఈనాటినుండి చట్టరీత్యాకూడా కాదు.

ఈ కథ ఐదు భాగాలు—



ఆనాడు అతను ఓచిత్రానికి సహాయ దర్శకుడు. అంటే ఆ ఉద్యోగం హోదా తనకి తానే ఇచ్చుకున్నాడు. ఆరాత్రి షూటింగుఐ, బైటకి వచ్చేటప్పటికీ, ఒకామె నుంచునివుంది బైట రోడ్డుమీద. ఆ అపరరాత్రి స్టూడియో దగ్గిర ఒక్కతెగా ఆమె నుంచుని వుండడం వింతగాకనిపించి ఆగాడు అతను. అపరరాత్రులైనా స్టూడియోల వెలపల, నీడల్లో, చెట్లకొమ్మలమీద, బైటికివొచ్చే మనుషుల బుజాలమీద రంగుల పిట్టలు వాలుతో వుంటాయి ఎప్పుడన్నా. కాని ఆపిట్టలకి కార్లున్నవాళ్ళ బుజాలూ, వొడులూ ఛాలా యిష్టం. ఈమె వాలకం వేరుగావుంది. ఆగాడు.

ఎందుకు ఆగాడా? ఆగకపోతే కథేలేదు, నిరంతరం ప్రతి నిమిషం యుగయుగాల్నుంచి యీ మాయ తెరమీద బొమ్మలవలే విసుగులేని కథకుడే ఆపాడు అతన్ని కొత్త కథకోసం.

"ఎవరు" అని అడిగాడు.

తలెత్తకుండానే, "ఏంలేదు" అంది.

"ఫిల్ములో చేరాలని వొచ్చావా?"

"అవును" అని ఆమె అంటే ఏం జరిగేదో. ఎందుకంటే అతని ప్రశ్న, జేబులో నాల్గు ఫిల్ముకంపెనీల అధికారం పెట్టుకుని అడిగినంత ధీమాగా వుంది. మరి దిక్కులేనట్టు నిలుచున్న స్త్రీముందు 'తానుతప్ప దిక్కులేని భార్య ముందూ' కాకపోతే ఇంకెక్కడ చూపుతాడు తన గొప్పతనం పురుషుడు ఈ క్రూర ప్రపంచంలో! కాని నవీన కాలంలో స్త్రీకి పరాయిదిక్కు దొరకడం సులభమౌతోంది అందుకనే పురుషుల్లో ఆత్మ విశ్వాసం, ధైర్యం తగ్గిపోయి న్నాయి. ఎందుకంటే పురుషుల కార్యశూరత్వానికీ, ఔన్నత్యానికి స్త్రీలనేత్రాలలో ఆరాధనే జన్మస్థానం.

ఆ రాత్రి ఆమె కాదని తలవూయించింది.

"ఐతే, ఎందుకిక్కడ?" అని విసుక్కున్నాడు అతను మొహంచెల్లడానికనీ ఆ రోడ్డుమీదకూడా అధికారాన్ని వహించి. అధికారంవున్నవాళ్ళని స్థల కాల నిర్ణయం కాని, అవి ఎక్కడా లేనివాళ్ళకి హద్దేముంది?

"సూర్యనారాయణగారు వున్నారా లోపల?"

"ఏ సూర్యనారాయణ?"

"చిత్రాంగదుడి వేషం"

"ఓ! ఉన్నాడు. ఎందుకు?"

"ఏంలేదు, మావూరే."

"రమ్మని చెప్పనా?"

"వొద్దు వొద్దు. వున్నారా అని: అంతే:"

ఆమె తల తిప్పేసుకుంది.

అతను అక్కడే ఆగాడు.

నాలుగు నిమిషాల్లో సూర్యనారాయణ వొచ్చాడు. ఆమె నీడలోకి జరిగింది. అతను వెళ్ళాడు. ఆమె అక్కడే నుంచునివుంది.

"ఏమిటి ఇంకా ఇక్కడే వున్నావు?"

"ఏమీలేదు, ఏమీలేదు" అని తడుముకుంటోంది.

"ఇంకెవరూ వుండరు ఇక్కడ, ఇంటికి వెళ్ళు"

"వెడతా వెడతా" అంటోంది. కళ్ళంబడి నీళ్ళు తిరిగాయి. పెదిమలు వొణికాయి. వేళ్ళతో చీర చెంగుని చుట్టిపెడుతో కిందికి చూస్తోంది.

"డబ్బులు లేవా బస్సుకి?"

"వున్నాయి, వున్నాయి."

"ఎవరికోసమన్నా నుంచున్నావా?"

"ఎవరికోసం నుంచుంటాను?"

ఆమెమాటలు నిజమనిపిస్తున్నాయి.

"తోవ తెలీదా? పేట పేరు మరిచిపోయినావా?"

"రైలుస్టేషను దగ్గిరే"

"వెళ్లుమరి. ఎక్కిస్తాను రా బస్సు చప్పున!"

"మీరూ రండి అందాకా" అంది.

"ఎందుకు భయం?"

"భయం లేదు. మీరూ రండి"

సెంట్రల్ స్టేషన్ ఎదురుగా దిగారు.

"ఇక్కడ సత్రం వుందికదూ?"

"ఇదేగా!"

"రండి"

హోటల్లోకి తీసి కెళ్ళింది.

"భోజనం పెట్టించండి. మీరూ భోజనం చేస్తారా?"

"అర్ధరాత్రి భోజనమా!"

వాళ్ళ బస్సుఖర్చు కాక రూపాయిన్నర అతనికి ఖర్చు. ఇదీ ఎత్తు. గోడదగ్గిర ఆమె పెట్టెవుంది. మూత తెరిచి రెండు రూపాయలిచ్చింది.

"ఇక్కడేనా నువ్వువుండడం?" అన్నాడు ధైర్యంగా. మాట్లాడలేదు.

"ఎన్నాళ్ళయింది నువ్వు ఈవూరువొచ్చి?"

"వారంరోజులయింది."

"ఇక్కడే వున్నావా?"

"లేదు. మావాళ్ళింటో వున్నాను."

"మరి... ..."

"భోజనానికి పోదాం."

భోజనం చేశాను.

"నేను వెళ్ళాలి యింటికి" అన్నాడు.

"వెళ్ళాలా!...నాకు కొంచెం పడుకోడానికి స్థలం చూపించమనండి. వీళ్ళని చూస్తే భయంగావుంది. మాట కూడా సరిగా తెలీదు."

"ఈ సత్రంలో వొక్కదానివీ పడుకుంటావా? గదికి అద్దెకూడా అడుగుతారు."

"ఇస్తాను"

కాని ఏమిటో ఆరాటం అతని మనసులో. ఈమె వొంటరిగా ఈ సత్రంలోనా?

"ఎందుకు వొచ్చేశావు మీవాళ్ళ యింట్లోనుంచి?"

"ఏంలేదు. శ్రీరంగం పోయినాం మావాళ్ళూ నేనూ. ఇక్కడ బంధువులయింట్లో దిగాం. రైలుదగ్గిర మావాళ్ళని ఏమరిచి వొచ్చేశాను."

"ఎందుకు?"

"వాళ్ళు ఇష్టంలేదు నాకు."

"ఏంచేస్తావు ఇక్కడ?"

"ఏమి చెయ్యను?"

"బాగా డబ్బువుందా!"

"ఆ. నలభై మూడురూపాయలు. ఇంకా ఈ గాజులు కూడా వున్నాయి."

"చూడూ, చాలా వెఱ్ఱిపని చేశావు. వృత్తి పిచ్చి దానివిలాగున్నావు. నిన్ను సూర్యనారాయణ ఎరుగునా?"

"ఊఁ" అని కష్టంగా.

"అతనితో చెప్పనా?"

"బాబూ, బాబూ, ఆపని చెయ్యకండి."

"ఎందుకు?"

"నన్ను చూస్తే చాలా కోపం ఆయనకి."

కష్టపడి ఆమెకోగది కుదిర్చి, ఆమెని దాంట్లో ప్రవేశపెట్టి, బైలుదేరాడు ఇంటికి.

ఎవరేం చెయ్యగలరు ఇట్లాంటి మనుషులకి అనుకుంటూ.

"మళ్ళీ ఎప్పుడు కనపడతారు?"

"నేనా? నాకిదే పనా!"

"మరి నే నేమైపోను?"

ఏడ్చింది. అతని హృదయం ఇవి సినిమాస్టార్ల జాల్లి యేడుపులకీ; గ్లిసరిన్ కన్నీళ్ళకీ అలవాటుపడి గడ్డ కట్టలేదు.

"సరేలే, పొద్దున్నే వొస్తాను."

"పోనీ ఇక్కడే పడుకోకూడదూ? వాళ్ళనడిగితే ఓ చాప ఇస్తారు నాకు. నా పక్క మీ కిస్తాను."

"నేను ఇంటికి పోవాద్దూ; చాలా బావుంది. రేపు వొస్తాను" అని విసుక్కుంటో వెళ్ళాడు.

కన్నీళ్ళతో వొంటరిగా నుంచున్న ఆమె రూపం ఒకటే బాధించింది, అత న్నా రాత్రి, అతని భార్య ముద్దు మాటల మధ్య.

మర్నాడు పొద్దున్న కొంచెం ఉత్సాహంగానే వెళ్ళాడు. తనని పెద్దనిచేసి, తాను కనపడాలనుకునే స్త్రీ ఒకామె వుండడం గర్వంగానే వుంది. ఓవారం కనపడకపోయినా, ఇంట్లో బియ్యం లేకపోతేనేగాని తాను లేని కొరత తన భార్యకి తోచదు. కూచునివుంది గదిలో – అతనికోసం చూస్తోందనుకుని సంతుష్టిపడ్డాడు. అవీ ఇవీ మాటలయింతరువాత వెళ్ళడానికి లేచాడు–

"మీ ఆఫీసుకేనా?"

"అవును. టయిమయింది. మా ఆఫీసుని స్టూడియో అంటారు."

"ఈవాళకూడా ఆయన వుంటారా అక్కడ?"

"ఎవరు?"

"అతనే. ఆ సూర్యనారాయణ" అంది విసుగ్గా.

"వుంటాడు; ఎందుకు వుండడూ?"

"ఏం చేస్తూవుంటాడు?"

"కబుర్లు చెప్పుకుంటో."

"బలే కబుర్లు చెపుతాడుకదూ? చిన్నప్పుడు మా వూళ్ళో—"

"ఆకబుర్లు ఇంకోసారి వింటాను, ఇప్పుడు వెళ్ళాలి. అతనితో చెప్పనా?"

"చెప్తారా? ... ..." అంది పరధ్యానంగా.

"అయినా, ఏమని చెప్పను? మీ రెవరని?"

చప్పున

"బాబోయ్. ఏం చెప్పకండి. చాలా పెద్దమనిషి. ఆడవాళ్లుకూడా వుంటారు కాదూ అక్కడ?"

"వుంటారు. వొస్తావా?"

"అమ్మో. రాను రాను. మరి అతను ఆ ఆడవాళ్లతో చాలా చనువుగా వుంటాడా?"

"వాళ్ళు వుణ్ణిస్తే చాలా మహారాజులాగా వుంటాడు"

"ఎందుకు వుణ్ణియ్యరేం? ఎంత శృంగార పురుషుడను కున్నారు! మావూళ్ళో..."

"ఆ సంగతులు తరువాత-నేను వెళ్ళాలి."

"సాయంత్రం వొస్తారా!"

"ఆ"

"తప్పకుండా రావాలి. మీరే దిక్కు-. మీరు రాక పోతే నాకీవూళ్ళో గతిలేదు."

కళ్ళంబడి నీళ్ళు. తలతిప్పేసుకుంది.

"తప్పక వస్తాను.

"చాలా మంచి వారండీ". అని అతని చేతిని పట్టు కుంది. వొదిలించుకుని వెళ్ళిపోయినాడు. తోవలో ఆలోచించుకున్నాడు. ఇదేమిటి, తనే గతిఅంటుంది. అతుకోడు గద! ఏం చేసుకుంటాడు ఈమెని?

ఆ వాళ సూర్యనారాయణతో స్నేహం చేసుకున్నాడు. వాళ్ళవూరూ అతని పూర్వజీవితమూ సోమరిగా అడిగాడు. విశేషం ఏమీలేదు. నాటకాలలో వేషాలు వేసేవాడు పాడతాడు.

ఆ సాయంత్రం ఆమెని అడిగాడు.

"ఈవూళ్ళో కొంతకాలం వుండదలుచుకున్నావా?"

"వుండక ఏంచెయ్యను?"

"అంటే మీవాళ్ళదగ్గిరికి వెళ్ళవా?"

"మళ్ళీ కైదు."

"అయితే ఈ వూళ్లో ఏంచేస్తావు?"

"ఏం చెయ్యాలి? ఏమి చెయ్యను?"

"అంటే ఎట్లా బతుకుతావు? డబ్బూ?"

"అవును, మీరే చెప్పండి."

"నేనేం చెప్పను? చదువుకోలేదు నువ్వు ఇక వంట చెయ్యాలి."

"ఎవరింటోనో వంట చేస్తూనా?"

ఊరికే అన్నాడుగాని పాపం ఈమె వంటమనిషా?

"ఎందుకూ అట్లా బతకడం?" అంది మళ్ళీ.

"ఎందుకు బతకడం? మరి బతకాలిగా!"

ఆమె మాట్లాడలేదు. చప్పున ఆగిపోయినాడు. ఎంత పెద్దప్రశ్న? ఎందుకు బతకడం? తనా స్టూడియోలో పరుగు లెత్తుతో భార్య వండుతో. ఈమె వంట మనిషి పనిచేస్తో! ఎందుకు ఇట్లా బతుకుతూ వుండడం?

"ఏమిటి ఆలోచిస్తున్నారు?"

"ఏంలేదు. నీసంగతే."

"మీకేదో పెద్ద ఉద్యోగం కదా! నాకేమన్నా చీలు చూపలేరా?"

అట్లా స్త్రీ కళ్ళకేసి చూస్తో దీనంగా విశ్వాసంతో అడుగుతోవుంటే తనదేం పెద్దఉద్యోగం కాదని ఎట్లా చెప్తాడు!

"నీకేమన్నా పాట వొచ్చా?"

"ఏం పాట."

"ఏమన్నా పాడడం"

"ఎబ్బె ఎందుకు?"

"సినిమాలో ఏమన్నా పని దొరుకుతుందేమోనని."

"వేషమే!"

"ఏం?"

"నాకేం చాతనవుతుంది?"

"సరేలే చూద్దాం. మళ్ళీ వొస్తా."

"మరి మీదేభారం."

అని మళ్ళీ చెయ్యి పట్టుకుంది. అతను చేతిని విడుల్చుకోలేదు. ఆమె చేతిని వొదలగానే తొరతొరగా వెళ్ళిపోయినాడు. మళ్ళీ రాత్రంతా ఆమె కలవరపెట్టింది అతన్ని. సినిమా ఆడవాళ్లని ఆరునెలలు చూసింతరువాత,

చాలా నిర్మలంగా వుంది మనసు. అట్టాంటి అమాయకు రాల్ని కలుసుకొని మాట్లాడడం.

... ... ...

అతను పనిచేసే చిత్రంలో మిగిలినభాగం కొల్లా పూరులో తీస్తారని తెలిసింది. ఆ చిత్రంలో తనకి ఉద్యోగం అతను స్వయంగా ఇచ్చుకున్నాడు గనుక, అతనూ కొల్లా పురం వెళ్ళితీరాలి. వెళ్ళకపోతే చిత్రం ఎట్లా పూర్తి అవు తుంది ? కొల్హాపురం వెడుతున్నామని ఆ సినిమావారు ఎవరూ అతనితో చెప్పలేదు; అనవసర మనుకున్నట్టున్నారు. కాని అతను తెలుసుకున్నాడు. చిత్రకారులకి బుద్ధిలేకపోతే, తనకి లేదా ? నాలుగురోజుల్లో ప్రయాణం. భార్యని పుట్టింటికి పంపేశాడు. భార్య సమస్య చులకనగా తీరింది. గాని, మిత్రు రాలి సమస్య కష్టమైపోయింది. తన ఇల్లు ఖాళీ అయిందిగనక మిత్రురాలికి అద్దె కిచ్చాడు, తను తిరిగివచ్చిందాకా ఉండ మని. తన సామానుతో సహా.

"ఎంత డబ్బుంది నీ దగ్గర ?"

"పాతిక రూపాయలూ ఈ గాజులూ."

"సరే, వుండు. నేను వెడుతున్నాను కదా, తరవాత ఏం చెయ్యతలుచుకున్నావు ?"

ఆ రాత్రి ఆమె వంటచేసింది. బైట చింతాద్రిపేట మురుగుకాలువ కంపుని చీల్చుకుని ఎక్కణ్ణించో వొస్తోంది నైట్‌క్వీన్ పరిమళం. అతను మంచంమీద కూర్చున్నాడు. ఆమె గుమ్మాన్నానుకుని కూచుంది.

"మీరు వెళ్ళకపోతేనేం?"

వెళ్ళకపోతే మునుచుకుపోయిందేమీ లేదు.

"నేను వెళ్ళకండానా? నేను లేకండా ఏం చేస్తారు వాళ్ళు అక్కడ? మరి చిత్రం పూర్తికావొద్దా?"

ఈ నాలుగురోజులూ ఆ అబద్ధంలో హోదాలో సంతోషించాడు పాపం ఆ యువకుడు. తాను వెళ్ళాక నిజం తెలుసుకుంటుంది. తెలుసుకోనీ, అతనెవరరో, ఆమె ఎవరో అటు తరువాత.

"నన్నుకూడా మీతో తీసుకుని వెళ్ళడానికి వీలు పడదా?"

"ఏ మాత్రం వీలుపడదు. నేనేం అనామకుణ్ణను కున్నావా? నా ప్రతిష్టపోతే నా బృందాన్ని అధికారంలో వుంచగలనా?"

"మీరు వెడితే నేనేం కాను ఇక్కడ?"

"ఇల్లిచ్చాను. అంతకన్న ఏం చెయ్యాను? అద్దె నువ్వే కట్టుకోవాలి.

ఆ గుడ్డిదీపంముందు ఆ నిర్భాగ్యులిద్దరూ, ఇద్దరిజీవి తాలూ అబద్ధంలోనే అల్లుకున్నారు, ఒకరివంక ఒకరు.

"నా కేదన్నా తోవ చూపలేరా?"

"ఆదేఆలోచిస్తున్నాను." అన్నాడు అతను దర్జాగా. తన గొప్పమాటలు నమ్మి, మామగారు ప్రతినెలా వంద రూపాయలు పంపడం మానినరోజున అతని సంగతి ఎవరు ఆలోచిస్తారు?

ఆమె చీకట్లో మంచం దగ్గిరిగా జరిగి అతనికాళ్ళు పట్టుకుంది.

"నేను మీ మనిషిని. నన్నేమన్నా చేసుకోండి. నేను మళ్ళీ ఇంటికిపోకుండా నాకింత కూడు కల్పించండి. మీ రుణం ఎన్నటికీ మరిచిపోను..." అంది.

ఈ స్వతంత్రభారతావనిలో స్వతంత్రం యాచించే ఎన్ని వేల స్త్రీలకంఠాలో కలిశాయి ఆ ఆర్తనాదంలో.

తమాషా ఏమిటంటే అన్ని అబద్ధాలు చెప్పిన, చెప్పించుకున్న ఆ స్త్రీ, ఆ రాత్రి తన దిక్కులేనితనంలో అన్న ఆ మాటలో నిజంమాత్రం నిలపెట్టుకుంది.

ఆ రాత్రి వాళ్ళిద్దరూ ఆ మంచంమీదే నిద్రపోయినారు. ఎందుకంటే ఆ ఇంట్లో వేరేమంచంలేదు. చాపకూడా లేదు. వున్న నాలుగుచీరెల్లో మంచి చీరె చెరుగుని కింద పరుచుకుని చలిలో ఆమె పడుకుంటే భరించలేకపోయినాడు అతను.

మీ కళ్ళలో ఈనాడు ఆ యువతీ యువకులమీద గొప్పదయ సానుభూతీ కనపడుతున్నాయి ఎందుకు? అదృష్ట దేవత చివరికి వాళ్ళని ఆశీర్వదించింది గనుక. ధనం, హోదాయేకాక, పెళ్ళిఅనే పవిత్ర పుష్పహారం వాళ్ళమెళ్ళో మెరిసింది గనక. కాని అట్లా విలవలేకుండ, దేహాన్ని ఇచ్చేసుకున్న స్త్రీ ఎటువంటి దుర్గతికి దిగిందని విన్నా ఏమీ కనికరంరాదు.

ఈ సినిమా-కళకాదు-సినీమాకాళిముందు ఎన్ని జీవితాలు శీలాలు ఎన్ని విధాలుగా బలిపోతున్నాయో మీకంద

రికీ తెలుసు. ఆ కళేబరాన్ని తొక్కి పైకిపాకి మన ఈకుర్చీ లని చేరుకున్న ధన్యులంగనక, మీసాలు మెలేస్తో, కుర్చీళ్ళ తోసుకొంటో హాయిగా కూచున్నాము ఇక్కడ.

తెల్లారికట్లే లేచాడు అతను తనని తాను విసు క్కుంటో.

"ఈ పనికూడా చేశాను. ఇదో లంపటి పెట్టు కున్నానే!" అనుకుంటో.

ఈనాడు చాలా పత్రికల్లో పడ్డాయి మా ఇద్దరి చిత్రాలు, మా జీవితకథలూ, మా దివ్య ప్రణయగాథలూ. కాని ఆ రాత్రి ఆ చీకట్లో, అలసటలో, పక్క సైడుకాలవ కంపులో, అంతకన్న చేసేపనిలేక......

ఆ రాత్రి కలయికని ఏ చలమో కథ రచించాడంటే, ఏదో గొప్పజ్యోతి వాళ్ళిద్దరి హృదయాల్లోనూ వెలిగిందనీ, దివ్యపుష్ప వర్షం కురిపించారనీ, అట్లా ప్రేమించుకున్న తరు వాత వాళ్లు సాధారణ మానవత్వాన్ని దాటిపోయినారనీ రాస్తాడు.

కాని వాళ్ళ మనసులో ఏ భేదమూ కలగలేదు – పర్యవసానాలకి కొంతభయం తప్ప.

మర్నాడు అతనికి శారదాంబ కనపడ్డది.

నాలుగుచిత్రాల్లో నటించిన అతనికి తెలిసిన Extra. ఆమెతో కాజుయల్‌గా అన్నాడు తనఇంటోవున్న ఆమెని ఎక్కడన్నా సినీమాలో ప్రవేశపెట్టమని. మూడురాత్రులు ఆ మంచంమీద, ఆమెతో భార్యతోవలెనే గడిపి, వెళ్ళి పోయినాడు రైలెక్కి. అదీ మొదటిభాగం. ఇంక రెండోది.

సంవత్సరానికి తిరిగివొచ్చాడు. అతను కొల్హాపూరు నించి. ఆ సంవత్సరంలో ఆమెని ఎప్పుడూ తలుచుకోనేలేదు. తిరిగి వొచ్చేటప్పటికి అతని ఇంట్లో ఎవరో కొత్తవారు కాపర మున్నారు. ఆమె ఏమయిందో ఎవరికీ తెలీదు. అతని సామాను ఆ ఇంటో ఓమూల వుంది. అతనికి ఇల్లు దొరక్క-అక్కడక్కడ, వాళ్ళదగ్గిరా వీళ్ళదగ్గిరా గడుపుతున్నాడు. అతను స్వయంగా ఉద్యోగం చేస్తున్న చిత్రం ఎడిటింగ్ కి పోయింది. అందుకని తనేదో పనివిూద ఉన్నట్టు తిరగడానికి కూడా excuse కనపళ్ళేదు. ఇంకెవరన్నా తనని ఆ చుట్టు పక్కల ఉణ్ణియ్యడానికి వొప్పుకొనే చిత్రం వాళ్లు దొరుకు తారేమో నని భోగట్టాలు చేస్తున్నాడు. ఆమె ఏమై వుం టుంది? పాపం, తనవూరు పోయివుంటుంది. శారదాంబని కనుక్కుందామంటే, ఆమె నాటకాలజట్టులో ఆంధ్రదేశం పర్యటన చేస్తోంది.

ఆ రోజు శాంతారాం మద్రాసు వొస్తున్నాడు. మద్రాసు సినీమా ప్రపంచమంతా స్టేషన్లో చేరుతోంది. మరి అతనంత ప్రముఖుడు. స్టేషన్ కి వెళ్ళకపోతే చాలా లోటుగా వుంటుంది. శాంతారాం తనకి అవమానం జరిగింది అనుకోవచ్చు. వెడితే, శాంతారాం అతన్ని చూడగానే, 'ఇదేమిటి నీవంటివాడు ఈ మద్రాసులో? ఇక్కడ ఎంత కీర్తివంతుడివైతేమాత్రం ఏం లాభం? సర్వభారతసినీమా కీర్తికి రావలసినవాడివి. నాతో రా' అనవొచ్చు. అందుకని తనీ వూళ్ళో పూర్వం కొంత ప్రత్యేకత సంపాయించు

కోడాని కని కుట్టించుకున్న షేర్వానీ తీసి, దులిపి, ధరించాడు. తనభార్య టిస్యూచీరని షాల్లాగా తలకిచుట్టి ఓ పూలమాల కొని స్టేషన్‌కి హాజరైనాడు. ఆవేషంలో అతని మిత్రులు కూడా అతన్ని గుర్తించలేదు. శాంతారాం వొచ్చాడు. పుష్ప మాలాలంకృతుడైనాడు, వెళ్ళాడు. కాని అతని మాల అతని చేతుల్లోనే వుండిపోయింది. శాంతారాంకు ముప్పైగజాల దూరంలోనే వుండిపోక తప్పింది కాదు. అతనికి- ఎంతముందుకి తోసుకు వెళ్ళినా. వాళ్లు మండి పోయింది. ఓ మోటారుకారు అద్దంలో తన ప్రతిబింబం కనపడేటప్పటికి చాలా Foolish గా Comical గా తట్టింది అతని రూపం.

ఆ పక్కన నుంచున్న ముష్టిపిల్ల మెళ్లో వేశాడు ఆ మాలని వాళ్ళుమండి. ఆటాక్సీలో ఎవరో నవ్వారు. దాని నిండా సినిమా ఆడవాళ్ళు. కారు బైలుదేరింది అతని పక్క నుంచి. దాంటోవాళ్లు అతని పక్కకి రాగానే—

"ఏం అంత నవ్వు? విరుచుకుపడుతున్నారు, మీా బతుకులకి" అన్నాడు.

పెద్దనవ్వు. "తెలుగువాడేనే" అని ఒకామె. కారు వెళ్ళిపోయింది.

అతను అవమానంతో దహించుకుపోతున్నాడు. మొదట తన వూళ్లో ఆ షేర్వానీని ధరించినప్పుడు అతని పినతండ్రి నేలకి ఒంగి సలాముచేసి,

"ఆదాబన్. ఆవ్. బిర్యానీ ఖావ్," అన్నప్పుడు కూడా అతనికి అంత కోపం రాలేదు.

ఇంతలో అతని వెనుక ఎవరో

"ఏమండీ" అన్నారు.

తిరిగిచూస్తే ఇందాకటి కారు అక్కడే ఆగివుంది అతని వెనక. దాంట్లోంచి తొంగిచూస్తున్నారు.

ఆమె కారులోంచి దిగి వొచ్చినట్టుంది.

"ఏమిటి?"

అనేప్పటికి గుర్తుపట్టాడు. ఆమె!

"నువ్వా?"

"మిమ్మల్లా వేషంలో గుర్తుపట్టలేదు. ముందే గుర్తుపడితే నేను మిమల్ని, ఆ మాలని నామెళ్ళోనే వేశే వారేమో?"

సిగ్గు, సిగ్గు. చప్పున సమయోచితంగా ... "ఆపూల మాలని శాంతారాం నాకిచ్చాడు" అన్నాడు.

"అవును చూశాను. అందుకనే ఆ మాలని నేను కాంక్షించింది" అంది ఆమె.

అని,

"మీ సామాను సరిగా వుందా? ఎన్నాళ్లయింది వొచ్చి?"

టాక్సీ మీటర్ పరుగెత్తుతోంది. పిలుస్తున్నారు వాళ్లు.

"నువ్విక్కడే వున్నావా?"

"అవును. పద. శింగార మొదలివీధి, రాయపురం వొస్తారా?" అంది కారుదగ్గరికి పరిగెత్తుతో.

"తప్పక రావాలి. ఇవాళే" అని అరిచింది కారుకిటికీ లోంచి.

వెళ్ళాలా లేదా? అతని అబద్ధాలసంగతి ఆమె అప్పుడే గ్రహించివుంటుందని అతని తెలివికి సహితం తెలుస్తోనే వుంది.

వుండలేక మర్నాడు సాయంత్రం వెళ్ళాడు.

ఓ గదిలో ఆమె పాడుతోంది. ఒక హార్మోనియం మీద వాయిస్తో. ఒక గిరజాలజుట్టు అతను ఆమె పాటని దిద్దుతున్నాడు. అతన్ని కూచోమని ఆమె పాడుతోంది. ఆ ఇల్లంతా గదులు గదులు. హాలునికూడా తడికలతో విభజించారు. అందరూ ఆడవాళ్లు. బ్రాథెల్ లాగు వుంది. పాటయి గిరజాల అతను వెళ్లాక హోటలునించి ఫలహారం, టీ తెప్పించి ఇచ్చింది. అతని సంగతి కనుక్కుంది.

"ఫిల్ము ఎడిటింగులో వుందా? అందుకనే మీకంత పనిలేదన్నమాట. వుంటారా ఈ వూళ్ళోనే. కొత్తఫిల్ము ప్రారంభించే ఏర్పాట్లు చేస్తున్నారా?"

ఈమెకి తెలీలేదా? వేళాకోళం చేస్తోందా?

జవాబు ఏదో గొణిగి ఆమె వృత్తాంతం అడిగాడు. ఆ శారదాంబగారు ఆమెని కళానిలయ ఫిల్ము కంపెనీకి తీసుకు వెళ్ళింది. ఆమెకి ఒకచిన్న పార్టు ఇచ్చారు. నెలకి యాభై రూపాయల జీతం. రిహార్సల్సు జరుగుతున్నాయి. ఈ లోపల Play-backs పాడి కొంచెం సంపాయించింది.

"నీకు పాట వొచ్చునని నాకు తెలీదు."

"నాకూ తెలీదు. వాళ్ళు పాడమన్నారు, పాడాను. ఇష్టపడ్డారు."

"ఈ ఇల్లెవరిది?"

"మేం చాలామందిమి ఆడవాళ్ళం చేరి అద్దెకి తీసుకున్నాము."

"సంగీతం నేర్చుకుంటున్నారా?"

"ఆయన మా ఫిల్మ్ కవి. నా పాటకి మెరుగు పెడతానని వెంటపడ్డారు."

"మరి ఇంక నేను వెడతాను."

"వెళ్ళి?"

"వెళ్ళి—ఏమిటి?"

"ఇంతేనా?"

"అంటే?"

"చూడండీ, మిమ్మల్ని నేను మరిచిపోయినా నను కుంటున్నారు. మీరే నన్నిట్లా కాపాడింది. మీరెంతగొప్ప వారైనా నన్నుమీరు వొదలడానికి వీల్లేదు. నన్ను మరిచి పోవడానికి వీల్లేదు."

అని అతని వేళ్ళసందున ఆమె చేతివేళ్ళని పోనిచ్చి పట్టుకుంది. ఆమెకా అధికారం వుంది మరి!

"సరే. వొస్తోవుంటాలే...ఎప్పుడన్నా."

"అట్లాకాదు. ప్రతిరోజూ రావాలి. వొట్టెయ్యండి."

"ఎందుకు ప్రతిరోజూ?"

"అంతే. రావాలి. భయపడకండి. దేనికీ, డబ్బుకు గాని, ఇంక దేనికిగాని మనుషుల్ని బాధించే మనిషినికాను" అని జాలిగా నవ్వింది.

ప్రతి సాయంత్రం వీడింటికి వెళ్ళి ఓగంట కబుర్లు చెప్పి వెళ్ళిపోయేవాడు అతను. ఓ సాయంత్రం ఆమె దిగులుగా కూచుంది. కారణం—

"రిహార్సల్సులో నా ఉచ్చరణా, చెప్పేపద్ధతీ వొప్పు కోటంలేదు వాళ్లు. ఎంతనేర్పినా రాదంటారు. వాళ్ళు నేర్పినా రాదంటారు. నేర్పినపాట అట్లా తగలపడ్డది. ఈ కవి లేడూ ఆయన రాసినపాట అది. ఆ మాటలు ఎట్లా అనాలో నేర్పుతానని వొచ్చి, నాకు వొచ్చిందికాస్త పాడు చేశాడు. సంగీత దర్శకుడు ఇదేమిటి, నీపాట ఇట్లా పాడ య్యింది? అని తిట్టాడు. నాకు కాస్త సరిగా చెప్పటానికి మీకు తీరిక వుంటుందా? చాలా అనుభవ మున్న వారు మీరు. ఎంత మందిని తర్ఫీదు చేసి బాగు చేశారో!" అంది.

తనని హాస్యం చేస్తోందా? అంత చాతకానివాడా తాను?

ఆరోజునుంచి ఆమె పోర్షను తీసుకుని ఆమెకి నేర్పు తున్నాడు. మద్రాసు ఒచ్చినప్పుడు తాను Actor కావాలనే ఉద్దేశ్యంతో భావ ప్రదర్శనం అలవరచుకోడానికి ఓ పెద్ద అద్దంకొన్నాడు. దాన్ని తీసుకొచ్చి ఆమె గదిలో పెట్టి ఆమెకి భావ ప్రదర్శనం నేర్పడం ప్రారంభించాడు. తత్ఫలి తంగా ఆమెని చాలా మెచ్చుకుంటున్నారని సంతోషపడు తోంది ఆమె. దాంతో అతనికి విశ్వాసం హెచ్చింది. కాని

అతను డబ్బులేక ఉపవాసాలుంటున్నాడు. పైకిమాత్రం ఆమెముందు డాబుగా ఆకలి లేనట్టే నటిస్తో తన గొప్ప తనం చాటుకుంటున్నాడు.

ఫిల్ము తీస్తున్నారు. ఆనాడు ఆమె సెట్ మీదకి వెడుతోంది. ఆమెతో ఆమె సంబంధీకుడుగా అతనూ స్టూడియోకి వెళ్ళాడు. ఆమె మేకప్ దగ్గిర స్వయంగా వుండి సలహా నిచ్చి ఆమెని తయారుచేయించాడు. ఆ తయారుచేసే మనిషిని తాను ఎరిగి వుండడంవల్ల మేకప్ అయిన ఆమెకీ అసలు ఆమెకీ ఏమీ పోలికలేదు. లీలా చిట్నీస్ మారినకన్న ఎక్కువగా మారిపోయింది ఆమె. ఆమెని చూస్తే ఇదెక్కడి అందం అనిపించింది. మొదటి Rushes చూడటంతోటే డైరెక్టరు కవిని పిలిచి తక్కిన కథమార్చి ఆమె పోర్షన్ని ప్రాముఖ్యం చెయ్యమన్నాడు. ఆమెకి నెలకి రెండువందలయాభై రూపాయల జీతం అయింది.

ఈ లోపల అతని చిత్రం కంపెనీవారు రెండో ఫిల్ము తియ్యడానికి సన్నాహాలు చేసుకుంటున్నారు. ఈసారి అతన్ని ఆ చుట్టుపక్కల వుణ్ణిస్తారో లేదో అనుమానంగా వుంది. ఎందుకంటే ప్రొడ్యూసర్ల బంధువర్గంలోని యువకులు చాలా మంది పోగైనారు స్టూడియోలో.

ఓ సాయంత్రం ఆమె ప్రస్తావించింది అతనితో.

"మీరు రెండో చిత్రం తీయబోతున్నారుట. ఇంక మీకు తీరుబడి వుంటుందో లేదో."

"ఫరవాలేదు. సాయంత్రం ఏమీ పనివుండదు. వున్నా వాళ్ళకి పని చెప్పి వొచ్చేస్తాను. నా చేతికింద బాగా తర్ఫీదైనారు."

"మీ ఫిల్ములో నాకేమీ స్థలం వుండదా?"

"మరి చెప్పలేదేం? అందర్నీ బుక్ చేసుకున్నామే!"

"పోనీ మా ఫిల్ములో మీరు చేరండి."

"ఎందుకు? నాకేం ఖర్మం?"

ఆ మాటలు అనడానికి చాలా బాధపడ్డాడు. ఒకవేళ తనస్థితి తెలిసే మాట్లాడుతోందేమో ఆమె. ఆ మాట లనక పోయినా, ఓ ఫిల్ముకి తాను డైరెక్టరైనట్టే మాట్లాడుతున్నాడు అతను. మరి అంత హోదాగలవాడు ఇంత బీదగా ఎందుకు కనపడుతున్నాడు? చాలామంది సినిమాతారలు ధనం దాచుకుని బీదగానే వుంటున్నారు మరి.

మొదట్లో అతను ఫిల్ముల్లో సంపాదన ప్రయత్నం చేస్తానంటే మామగారు వొప్పుకోలేదు. అతను మద్రాసు పారిపోయి వొచ్చి, తనకి యాభైరూపాయల ఉద్యోగం అయిందని బొంకి, భార్యనీ, నెలకి వంద రూపాయల్ని తెప్పించుకున్నాడు. ఏడాదికిందట భార్య వెళ్ళి ఏంచెప్పిందో తండ్రితో, అతను నెలకి నల్భైరూపాయలే పంపుతున్నాడు. ఆదాయంతోపాటు అతని భోజనమూ, దాంతో రూపమూ సన్నగిల్లాయి. బట్టలు చినిగిపోయినాయి. అదంతా ఆమె గమనిస్తోనేవుందని అతనికి తెలీదు.

"ఖర్మమేమిటి లెండి? అక్కడ మీకు పని ఎక్కువగా లేదంటున్నారు. పైగా మా ఫిల్ముడైరెక్టరుకి ఏమీ

తెలివి లేదు. వూరికే తడుముకుంటాడు. మీవంటివారు వుండి సరైనమార్గం చూపితే కొంత బాగుపడతాడు. పైగా నాకు కనపడుతో వుంటారు. అదీ నాకు ముఖ్యమైన విషయం."

"నేనెందుకు నీకు కనపడడం?"

ఆమె పొరపాటున మాట అనేసినట్టు వూరుకుంది.

"ఏంలేదు. కనపడితే నాకు ధైర్యంగా వుంటుంది."

"నేను వుచితంగా ఎందుకు చేస్తాను?"

ఉచితంగా, ఫిల్ముగుంపులో ఉణ్ణిస్తేనే చాలు-ఏనాటికైనా పైకి పాకలేకపోతానా అనుకునే మనిషి తీరా offer దానంతట అదే వొచ్చేప్పటికి బేరం ఆడుతున్నాడు. అదిగాక తాను ఎవరికి సహాయం చేశాడో ఆమె తనకి సహాయం చేస్తానంటోంది. భరించలేదు.

"నెలకి వందరూపాయలు ఇయ్యరా ఏమిటి?"

వందరూపాయలే!

"ఎందుకు ఇస్తారు? అయినా వంద నాకేం లెఖ్ఖ."

"నేను మాట్లాడి పెడతాను కాదూ? ఏదో పైఖర్చుకి వుంటుంది."

అనుమానం భగ్గుమంది. ఈమె చెపితే ఎందుకు వింటాడు ఆ డైరెక్టరు? అయినా, తనకేం సంబంధం!

"నువ్వు మాట్లాడితే, నాకెందుకు ఉద్యోగం యిస్తాడు?"

"మీ కీర్తిని ఆయనమాత్రం వినలేదనుకున్నారా? మీతో పోటీచెయ్యగలనా అని ఎంత భయమనుకున్నారు

మా డైరెక్టరుకి? అదిగాక మీరునన్ను తర్ఫీదుచేసిం తర వాత నామీదా చాలా గౌరవం కలిగింది ఆయనకి."

ఏమైతేనేం? ఉద్యోగం నిజమైతే—

నిజమే అయింది. వందరూపాయల ఉద్యోగం సహాయ దర్శకుడిగా దొరికింది.

3

ఆర్నెల్లయింది. తను ఇంకా వంద రూపాయల ఉద్యోగం చేస్తూనేవున్నాడు. ఆమె మూడు చిత్రాలలో ఏక కాలమందే నటిస్తూంది—ఒక్కొక్క చిత్రంలో నెలకివెయ్యి రూపాయల జీతం తీసుకుంటూ. ఆమె మేకప్ అద్భుతం. ఎటు వంటి భావాలనూ అద్భుతంగా ప్రదర్శిస్తుంది. కాని అవన్నీ అతనుచూసి బోధించాలి. మాటలభావం ఉచ్చారణ చూపాలి. పాటధోరణిని దిద్దాలి ఇంటిదగ్గిర. అతను ఏం నేర్పితే అది చిలకమల్లే చక్కగా, కళ్ళు చెదిరేట్టు వప్ప చెపుతుంది. ఇంతైనా ఆమె అభ్యుదయానికి ఇంకేవో తప్పుడు కారణాలు వుండాలని అనుమానిస్తోనే వున్నాడు.

మామగారు డబ్బు పంపడం మానాడు. భార్యని పంపమని అతను రాయనూలేదు.

చాలాసార్లు ఆమె అడిగింది అతన్ని, గదిని వొదిలి తాను మంచిఇంటోకి పోతలుచుకున్నాననీ, చూసిపెట్టమనీ. వందరూపాయల జీతంతో అతను కొంచెం హాయిగానే ఉన్నాడు. అతని అసలుఫిల్ముఉద్యోగం సంగతి ఆమె ఎత్త

లేదు మళ్ళీ. అతను తన కొత్తఉద్యోగంలో నటీనటులకి రిహార్సల్సు చేయిస్తూనేఉన్నాడు. కానిఅతనినించి వాళ్ళకేమీ రాలేదు. అతనిలో ఏమాత్రం ప్రతిభ ఉన్నట్టూ ఎవరూ గుర్తించలేదు. ఏమూలో అతనికి ఆమె తనమూలాన అంత ఉచ్ఛస్థితికి వొచ్చిందికదా, ఆ టీ ఫలహారం తప్ప తనని తీసుకోమని ఎప్పుడూ ఏమీ ఇచ్చిందికాదే అని బాధగానే వుంది. సినీమాలలో తన కంఠకన్న గతులు లేవని అతనికి అర్థమయింది. తనవూళ్ళోనే ఆ మాత్రం ఉద్యోగం ఎక్కడైనా చేసుకోవచ్చే! మామగారి ఇంటో హాయిగా ఉచితంగా తింటూ బతకవచ్చే! ఆ ఉద్యోగం కాక, ఈమెకి ఆ పాఠాలు. ఎందుకొచ్చిన చాకిరీ ఇదంతా, అని చాలాసార్లు అప్పుడప్పుడు యోచించాడు. కాని సినిమాలో ఏదో ఉత్సాహం. రంగుల మాయా ఉన్నాయి. ఆసంగతి అతనికి తెలీదు. అట్లానే వుండిపోయినాడు మొత్తానికి.

ఇంతలో ఆమెకి ఇల్లు దొరికింది, మాంబళంలో చిన్న బంగళా.

"ఎల్లుండి వెళ్ళిపోదాం" అంది.

"ఎవరు?"

"మీరూ నేనూ."

"నేనా? నే నెందుకు?"

ఆమె మాట్లాడలేదు. మొహం తిప్పేసుకుంది ఆ చీకటిగదిలో చీకట్లోకి. మళ్ళీ తనవేపు తిరిగేలోపున కళ్ళనీళ్ళు తుడుచుకుంది.

"నే నెందుకు? అని అడిగితే, జవాబు ఏమీ లేదను కోండి. ఆ ప్రశ్న మీలో వస్తుందనుకోలేదు నేను."

"మరి నాకేం అర్థం కనపట్టంలేదు."

"నన్ను పట్టుకుని అన్నీ నేర్పడంలో ఏమన్నా అర్థం కనపడ్డదా మీకు ఇన్నాళ్ళూ?"

"ఆలోచించలేదు."

"నేను పాపాత్మురాలిని కాదు. మీ నించి నాకు భేదభావం లేదు కనకనే అంత చనువు తీసుకున్నాను. మగ వారు సులభంగా మరిచిపోతారు. స్త్రీ మరవలేదు. అందు వల్లనే అన్నీ కష్టాలు స్త్రీకి. అందువల్లనే లోకంలో కాపరా లనేవి నిలిచివున్నాయి.

"చలం ఎంత కూడదంటున్నా"

అని నవ్వాడు అతను.

ఆ ముందురోజే వాళ్ళు అరుణ చదువుకున్నారు.

వారంరోజులైనా ఆమె ఆ ప్రస్తావన మళ్ళీ తీసుకు రాలేదు. ఆ గది మారనూ లేదు.

ఆ మూడురాత్రుల సంగతి గాపును ఆమె మాట్లా డింది. తనమీద ప్రేమ ఆమెకి? కాని అతనికి అట్లాంటి బుద్ధిపుట్టలేదు. అభ్యంతరమూ లేదు. ఏదో ఎత్తు వేస్తోంది తను ఆమెనించి వెళ్ళిపోకుండా; శాశ్వతంగా తనని 'క్లోచ్' చేసేందుకు ఎత్తు. కాకపోతే ఆమెకి ఇంత ఉచ్ఛదశ—ఆమె ప్రతిభవల్లనైనా సినిమాలో పైకివెళ్లాలంటే, పడకగది సహాయంలేకండా పని కానేకాదు. ఇంత తనమీద ఇష్టమని

దొంగకన్నీళ్ళు పెట్టుకుంటే తాను మోసపోతాడా? ఆమెతో ఆ ఇంటోవుంటే, ఆమె పోషణకింద తనకేం గౌరవం?

"ఏమయింది కొత్త యింటి సంగతి?"

అన్నాడు బీచిముందు ఆమెతో.

"ఎవరికో యిచ్చేశారు."

"అదేమిటి?"

"మీరులేంది, నా కొక్కర్తెకూ ఆ యిల్లెందుకు?"

"సరిగా చెప్పు. నన్నెందుకు రమ్మంటున్నావు?"

"ఎందుకు రానంటున్నారు? మీరు వచ్చి నాతో కలిసి వుండటానికి నా మనసులో కారణం వెతుక్కో నక్కర్లేదు. రాకుండా వుండటానికి మీరు వెతుక్కోవాలి కారణాలు—అవును మరి! మీకు యిల్లుందా వేరే?"

"ఏం? నా భార్య రాకూడదా?"

"వొచ్చినా? మనతో వుండదా ఆమె? సరేలెండి. ఆమె వొచ్చాకకద. అయితే రప్పించండి. ఆమెతో మాట్లాడి సరిపుచ్చుకోగలను నేను."

"అవునులే. నీతో మే మెక్కడ తూగగలం!"

"తూగడ మేముందీ. అంతా మీదే."

"మాదా?"

"ఎందుకు ఆ అబద్ధం మీలో; మీకు తెలీదా? నేనేం సంపాయించినా, అంతా మీరు పెట్టిన భిక్ష అని! ఎప్పుడో చేసి వొదిలిన సహాయంకాదు. ప్రతిదినమూ మీ తిండి తింటున్నాను."

"అది నీ మంచితనం. నేనేం అట్లా అనుకోటంలేదు."

"సరే పోనీండి. నే నిట్లా ఈ గొందిలోనే చీకట్లో కుళ్ళిపోతాను. సంతోషించండి."

అని అక్కణ్ణించి లేచిపోయింది.

ఇంకోరోజు అతను వెళ్ళికూచోగానే మాట్లాడకుండా అతనికేసి చూస్తూ కూచుంది.

"ఏమిటి సంగతి?"

"రాత్రి సినిమా చూడ్డానికి వెళ్లాను."

"వెడితే అట్లా చూడ్డమెందుకు?"

"దాంట్లో మీవంటివాడే వున్నాడు."

"ఏం చిత్రం?"

"జిందగీ"

"చివరి కేమయింది?"

"ఏమయింది? ఇద్దరి జీవితాలూ దగ్ధమైనాయి."

"మనవీ అట్లానే ఔతాయంటావా?"

"కావు."

"ఎందుకు?"

"నేను శ్రీమతిని కాను గనక."

"కాక..."

"ఆమెకి చాలా బిడియం, అలివికాని ఆత్మగౌరవం—కాదు గర్వం."

"నీకు?"

"నేను సిగ్గులేనిదాన్ని."

"ఏమీ కాదు."

"మీరాముందు."

అని మళ్ళీ

"పాపం ఎన్ని కలలు కంటుంది!"

"నువ్వో?"

"నేనూనూ. అక్కడే పోలిక."

"ఏం కలలు"

"ఆమెవి ఏమైతేనేం? నావి మీకు తెలుసు."

"చక్కని బంగళా."

"ఊఁ"

"కారు."

"ఊఁ"

"బంగళాముందు తోట, లోపల చక్కని ఫర్నిచర్"

"ఊఁ"

"అంతేనా?"

"కాదు"

"జాతికుక్కలు, నౌకర్లు"

"ఊఁ"

"అంతేనా?"

"అంతేలెండి. చాలు"

అని పాట పాడుకుంటోంది.

ఏమిటి ఈమె తనభార్యమల్లే కాపరం పెట్టాలనుకుంటుందికాబోను. ఒకే ఎత్తు వేసింది. ఇంక తనకేం పని?

ఆమెవెంట సామాన్లు పట్టుకుని చీరెలూ, Bag, కుక్కా...
ఆమె లోపలికి వెడుతూ తనని కొన్ని గదుల గుమ్మాలముందే ఆగమని.

అని ఆలోచించుకుంటున్నాడు.

"ఆలోచించుకోండి. ఇంకా ఊహించుకోండి మీ చిత్తమైనన్ని. అబ్బా మనుషుల అభిమానాలూ అనుమానాలూ"

అని విస్కీని మళ్ళీ పాడుకుంటోంది.

ఇలా వాళ్ళ మధ్యనున్న సుహ్రుద్భావం చెడింది. అతను వెళ్ళడం తగ్గిస్తున్నాడు. ఆమెకూడా నిరాశతోనూ ఉపేక్షతోనూ ఊరుకుంది. అదిగాక ఆమెకి చాలాపని. ఆమె మొదటిచిత్రం గొప్ప విజయవంతం అయింది. ఇంకా కొత్త Offers వొచ్చే సూచనలు గాలిలో ఎగురుతున్నాయి.

ఇంతలో ఆ చిత్రం మద్రాసులో విడుదలయింది. ఇదివరకు పత్రికలనిండా ఆమె పటాలు. ఇప్పుడు ఆమె మద్రాసు వీధుల గోడలపక్క కెక్కింది. ఒకటే సిగ్గు ఆమెకి.

"మనం వెళ్ళి చూడవొద్దూ?" అని అడిగింది సందేహంగానే.

"కానీ"

"మనిద్దరికీ Pass తీసుకొస్తే వొప్పుకోరా మీరు?"

వొప్పుకోకుండా వుంటేనే ఘనతగా వుంటుందని పించింది అప్పటికప్పుడే అతనికి.

మొదటినుంచీ ఆమె అదృష్టం తన చేతుల మీదుగా నడిచిందనీ, ఆమెజీవితం తనని పెనవేసుకుందనీ, స్త్రీరత్వంలో కాలం గడపకుండా వుంటే అంత ఆత్మ గౌరవంలో నిలిచే వాడా అతను? అదిగాక ఆమె సామాన్యురాలుకాదు ఇప్పుడు. అనేక వేలమంది సినిమా ప్రేక్షకుల కలలకి ఆధరవుపట్టు.

"అట్లాకాదు. మనం గూఢంగా వెడదాము, టిక్కెట్లు కొనుక్కుని Taxi లో పోదాం. సినిమా అయింతరువాత బసోటాలో భోజనం. ఏం?" అంది.

బసోటా.! బసోటా భోజనాల సంగతి ఈమె కేం తెలుసు?

"బసోటా ఏమిటి?"

"బసోటా హోటల్ మీకు తెలీనట్టు!"

"నీకెట్లా తెలుసు?"

"మా డైరెక్టర్లు అనుకుంటూ వుంటారు, అక్కడ వాళ్ళ జీవితాలు తరిస్తున్నట్టు."

"మన జీవితాల్ని కూడా అక్కడే తరింపచేస్తేనేకాని ముక్తి లేదంటావా?"

"అంతకన్న ఏంలేక. పోనీ ఇంకో స్థలం చెప్పండి మీ కిష్టమయింది."

"సరేలే నీ ఇష్టం."

ఇంతా హాలు దగ్గిరికి వెడితే వారం రోజులుదాకా స్థలం దొరకదన్నారు. టాక్సీకోసం చూస్తూండగా ఎవరో

గుర్తుపట్టారు ఆమెని. 'కుసుమబాల' అని అరిచారు. గుంపు పోగయింది. రొద్దుబాము. ఆ సినీమాహాలువారు గుర్తించారు ఆమెని.

"మీరా!" అని ఆమెని లోపలికి తీసుకుపోయినారు.

అతను మిగిలిపోయినాడు. అందరిముందూ సిగ్గయి చప్పున గుంపులో కలిశాడు.

ఇంతేకదా! తనని వొదిలి వెళ్ళిపోయింది. అనామకుడు గనక అతను. తనెవరు ఆమెకి-కాకపోతే ?

ఇంతలో బుజాలమీద చెయ్యి. "పిలుస్తున్నారు మిమ్మల్ని" అని, వాళ్ళిద్దరికీ ప్రత్యేకంగా గది ఏర్పాటు చేశారు సినీమావాళ్లు, దాంతో మరింతకోపం అతనికి, తనని పిలవ నంపకపోతేనేం! ఇంక తన పేరు కలుపుతారు ఆమె పేరులో!

ఫిల్ము ప్రారంభమయింది. ఇన్‌టర్‌వల్‌దాకా అతనికి వొళ్లు తెలీలేదు. అంత ఐక్యమై పోయినాడు తెరతో. మధ్యలో దీపాలు వెలిగినప్పుడు తన చెయ్యి ఆమె చేతిలో సహజంగావుంది.

"ఏమిటిది ఏమిటిది! అది నువ్వే! నువ్వు. నువ్వు... నీకు పోలికకికూడా ఎవరూలేరు. నువ్వు అవతారం" అన్నాడు. అతనొక్కడేకాదు, ఆ ప్రేక్షకులందరిలో మాటనే అతనూ అన్నాడు. ఇంత ఖ్యాతిగడించినా ఆమె, ఆ ఖ్యాతి అంతా తెరమీద కుసుమబాలకి. ఆమెదికాదు. ఆమెని ఎరిగినవాళ్ళు స్టూడియోవాళ్ళు మాత్రమే. ఆమెది అంతవరకు చాలా గుప్తజీవితం. పైగా రంగులేని కుసుమని గుర్తించడం కష్టం.

మిగిలిన చిత్రాన్ని మెళుకువతో చూశాడు. అక్కడ ఆ అద్భుత లావణ్యవతి తనపక్కన కూచున్న స్త్రీ. అతని మనసు ఆ రెండురూపాల్నీ ఓక్షణం కలుపుకుంది. ఓక్షణం విడతీసుకుంది. కాని అతని చెయ్యి గట్టిగా ఆమెవేళ్ళమధ్య వుండిపోయింది.

హాలు వాళ్ళ కారులో ఇంటికి వెడుతున్నారు. అతని కళ్ళముందునించి ఆమె మెరుపు పోలేదు. లోకంలో మామూలు మర్యాదగల స్త్రీఐవుంటే ఆమె, ఆమె పాదాల మీద కళారాధనతో అతను వాలి వుండునేమో! కాని అతను కారులో నడుంమీద చెయ్యేసి దగ్గరగా తీసుకు న్నాడు. హోటల్లో భోజనం చేస్తోకూడా ఆమెనించి కళ్ళు తీసెయ్యలేదు అతను.

"ఎవరు నువ్వు?"

"మీరు నేర్పిందే"

"నేనా? నేనా?"

ఆ రాత్రి అతను ఆచీకటి గదిలో ఆమె మంచం మీదనే నిద్రపో ... లేదు, ఆమె కళ్ళవంక వెన్నెలలో చూస్తో.

వారం రోజుల్లో గోపాలపురంలో ఓ పెద్ద బంగాళా తీసుకున్నారు వాళ్ళిద్దరూ. కారు కొన్నారు. నౌకర్లని పెట్టారు. కొత్త చీరెలు, షోకులు, సూట్లు, వేషాలు. పది రోజుల మార్పుతో వాళ్ళని గుర్తించడం కష్టం.

కొన్నాళ్ళు వాళ్ళిద్దరూ చాలాసుఖంగా గడిపారు. ఆమెమీద అతనికేమీ ప్రేమలేదు. కాని ఆ తెరమీద చూసిన ఆ రాజకుమారిమీద అతనికి చెప్పరాని ప్రేమ; తలుచుకున్నంత మాత్రాన అతనివొళ్ళు పరవశమయ్యేది. తిరిగి తిరిగి ప్రయత్నించి ఆ రెండు రూపాలకీ సంబంధం కలుపుకున్నాడు. ఆమె అతన్ని ఇంటికి యజమానిని చేసింది. నౌకర్లు, డబ్బు, ఆజ్ఞలూ అన్నీ అతనినించే. అతని మన సులో అతనిమీద అతనికే గొప్ప గౌరవం ఏర్పడ్డది. ఆక స్మికమైన అతని అదృష్టాన్ని చూసి అతనికే ఆశ్చర్యం. ఆర్నెల్లూ నిమిషాలమల్లే గడిచిపోయినాయి. ఆమె ఆదా యం అమితంగా పెరిగిపోతోంది.

ఆమెకి వ్యవధి తక్కువవుతోంది. ఇంటోవున్న కాలంతో ఆమెని కొత్తపార్టుకి తర్ఫీదు చెయ్యడంతో సరి పోతుంది అతనికి. వ్యవధి చాలక అతను తన ఉద్యోగం మానేస్తానన్నాడు. ఆమె ఏమాత్రం వొప్పుకోలేదు. వొప్పు కోక పోవడం వింతగానే అనిపించింది.

అతని చిత్రంలో ప్రధానతారకి స్టూడియో మీద నిష్కారణంగా కోపం వొచ్చినందున ఆ రాత్రికి షూటింగు ఆగిపోయింది. కుసుమ ఇంటోనే వుంటుంది ఆ వేళ. అందు కని తొందర తొందరగా ఇంటికి వొచ్చాడు ఆమె కారులో. డ్రాయింగు గదిలో రేడియో పక్కగా కూచునివుంది ఆమె. ఆమె కుర్చీని ఆనుకుని ఒకతను మాట్లాడుతున్నాడు. ఇంకా

దీపాలు వెలిగించలేదు. చీకటి చీకటిగావుంది గది. ఎవరూ కబురు పంపించకుండా లోపలికి రారనుకొంది ఆమె. అందు కని అతను లోపలికి రాగానే, కోపంగా

"ఎవరు! ఏంచేస్తున్నావు నాగప్పన్?" అంది నౌకర్ని.

"నేనే" అన్నాడు అతను, ఆశ్చర్యపడుతో.

కుర్చీ పక్కగా నుంచున్న మనిషి దూరంగా జరి గాడు. అతను లైటువేసి ఎదుకు కుర్చీలో కూచున్నాడు. కొత్తగా వచ్చిన అతను వుత్త బిచ్చగాడిమల్లే వున్నాడు. అతనివంక అయిష్టంగా చూసి మాట్లాడకండా వెళ్ళిపోయి నాడు. ఆమె మేడపైకి రాగానే,

"ఎవరది!" అని అడిగాడు.

"బిచ్చం."

ఆమె అబద్ధం చెప్పిందని తెలిసింది అతనికి. కాని అంతకన్న తీర్చవలసిన విధం తెలీక.

"ఎందుకు రానిస్తావు అట్లాంటి వాళ్ళని!" అని తన గదిలోకి వెళ్ళిపోయినాడు.

అతని మనసు స్తిమితంగా లేదు. ఆ మనిషిని తా నెక్కడో చూశా ననిపిస్తోంది అతనికి. అతను ఇదివరకో రెండు మూడు సార్లు వొచ్చినట్టూ, మళ్ళీ ఒకసారి వొచ్చినట్టూ నౌకర్లు మాటల ధోరణిలో అన్నారు. అంతేగాక ఆమె బాంకుబుక్కులో ఆమె అప్పుడప్పుడు వందా, రెండు

వందలూ తీస్తున్నట్లు చూశాడు. ఇదివరకు అతనితో చెప్ప కండా డబ్బు తియ్యడం ఎప్పుడూ జరగలేదు.

ఆమె నడిగితే, ఏదో ఖర్చులు వొచ్చాయి జ్ఞాపకం లేదు అనేసింది విసుగ్గా.

ఒక రోజు అతను ఆమే కారుదిగి హాలు లోపలికి వొచ్చేప్పటికి, ఆనాడు వొచ్చిన మనిషీ, ఇంకో అతనూ అప్పటికీ కూచుని సిగరెట్లు కాలుస్తో మాట్లాడుకుంటున్నారు. ఆ మనిషి ఇప్పుడు శుభ్రమైనాడు. అతను సూర్యనారాయణ. పలకరించకండా ఎట్లా వుంటాడు అతను ?

"ఏమిటీ మీరా! ఆ సాయంత్రం మిమ్మల్ని గుర్తు పట్టలేకపోయినాను" అన్నాడు అతను.

"అవును, బళ్ళు ఓడలవుతాయి, ఓడలు బళ్లు అవు తాయి" అన్నాడు అతను, వెనక్కి కూచుని సిగరెట్ పీలుస్తో. వాళ్ళని చూసి ఆ వొచ్చినవాళ్లు అట్లానే కాలన్నా కదల్చకండా హాయిగా పొగరుమోతుగా కూచున్నారు. కొంతసేపు మాటల్లేవు. కాలే సిగరెట్టుముక్కని తివాసీమీద పారేసి, సూర్యనారాయణ,

"కుసుమా, నీతో వొంటరిగా మాట్లాడాలి." అన్నాడు,

"టీ తీసుకొస్తారు." అంది ఆమె.

"నా కెట్లానూ పనివుంది, వెడతాను. టీ నాకు పైకి పంపించు" అని లేచాడు అతను.

ముందు ఆమెని 'కుసుమ' అనగానే అతనికి కళ్ళు తిరిగాయి. ఇప్పుడు సరిగా నుంచోలేకపోయాడు.

ఆమె చప్పున లేచి అతన్ని ఆపి సూర్యనారాయణతో

"మాట్లాడేది ఇక్కడే మాట్లాడండి. రహస్యానికే ముంది?" అంది, మొహం ఎర్రనౌతో.

"అట్లా ఐతే సరే. నేను మొన్న స్టూడియోలో చెప్పలా రాజమాణిక్యంగారు ఈయనే!"

రాజమాణిక్యంగారు ఒక సినిమా కంపెనీని Float చేస్తున్నారు. దాని వివరాలు అడుగుతోంది. కుసుమ తెలుసు కున్న తరువాత,

"మీరు ఏమంటారు?" అంది అతనివేపు తిరిగి.

"ఏ విషయం?"

"ఆయన చెప్పిన వివరాల విషయం."

"కానీ చెయ్యనీ, చూద్దాం. ప్రస్తుతం ఆయన మాట లేగా ఆధారం?"

"నా మాటలు అబద్ధమంటారా? కావలిస్తే ఎల్లం గోలు రాజాగారిని—"

"అబద్ధమూ అనలేదు, నిజమూ అనలేదు. నాకు తెలియదంటున్నాను." అని,

"ఐనా నీకెందుకు ఈ వివరాలన్నీ?" నని ఆమె అడి గాడు.

"దాంటో పదివేలు షేర్లుకొంటే, సూర్యనారాయణ గారికి హీరోపాత్ర ఇస్తారట."

"సరే, ఆయనకి నమ్మకమైతే ఆ షేర్లు కొని, ఆ హీరో పాత్రని వెయ్యమను"

"ఆయనకి డబ్బేది? నన్ను సహాయం చెయ్యమంటు న్నారు"

"అట్లాగా!"

"మీ రేమంటారు?"

"పదివేలు ధర్మం చెయ్యాలనివుంటే, చెయ్యి"

"ధర్మంకింద కాదు. పెట్టుబడికింద"

"పెట్టుబడికింద ఏమీ లాభంలేదు"

"మీ కారణాలు!" అన్నాడు కోపంగా రాజ మాణిక్యం.

"మీతో కాదు నేను మాట్లాడింది."

"నే నడుగుతున్నాను మిమ్మల్ని?"

"కారణాలు చెప్పనవసరంలేదు."

"అయినా ఒక్క కారణం చెపుదురూ?"

"మీ మాటలు వింటేచాలు, మీవంక చూస్తే చాలు, వేరే కారణం అక్కర్లేదు."

'ఆ' అనిలేచాడు మీదికి వొచ్చేట్టు రాజమాణిక్యం.

"కూచోండి కూచోండి" అంది ఆమె.

టీ వొచ్చింది. తాగకుండానే లేచి వెళ్ళిపోయినాడు.

అతను పెద్ద ఆలోచనలో పడ్డాడు.

ఆమె అపాయంలోకి నడుస్తోంది. తనకి తెలీకుండానే వీళ్ళకి తనమీద చనువు నిచ్చుకుంది. తనేం చెయ్యాలి? ఆమె తనకు అంత అధికారము ఇస్తేనా? అంతవరకు తనేం

అధికారం తీసుకోలేదు. అవసరం రాలేదు. ఇప్పుడు తాను కల్పించుకుని ఆమెని అదిలించి మేల్కొలపాలా? కాని ఆమెని ఒత్తిడిచేస్తే ఎంతవరకు ఆమె సహిస్తుందో! అనుమానం అతనికి. తనకెందుకని తప్పుకుంటే? కాని నిస్సహాయంగా ఆమెని వొదలడం అన్యాయం. అదిగాక ఆమె తన స్త్రీ! తనని అన్నిటికీ నమ్మిన స్త్రీ.

అరగంటకి ఆమె పైకి వొచ్చి అతని పక్కలో ముద్దుగా కూచుని, అసహజంగా నవ్వుతెచ్చుకుంటో

"మరీ పెంకివారౌతున్నారేం? అంతకోపమా? వాళ్లేం చేశారు?"

"ఛీ వెధవలు. వాళ్ళని భరించలేను. ఐనా నీకేంపని వాళ్ళతో?"

"అదేమిటి? ఏదో కష్టంలోవుండి సహాయంకోసం వొస్తే ఇంతలో ఏం మునిగిపోయింది?"

"నేను కనుక్కున్నానుగా, ఆ రాజమాణిక్యం నమ్మకస్తుడే. నాకుకూడా చాలా నమ్మకం కుదిరింది. ఆ మాత్రం పరులకి సహాయం చెయ్యకండా ఎట్లా బతకగలం?"

"చెయ్యి, నేను వొద్దన్నానా?"

"వొద్దనకపోతేనేం? చాలా అయిష్టంగా వున్నారు."

"ఉండనుమరి! సరదాకోసం బాంకునోట్లతో వంట చేస్తానంటే, ఇష్టం చూపుతానా మరి!"

"పోనీలెండి, ఏదో నా సరదాకి ఆడబ్బు ఇవ్వనీండి. ఇంక మనసులో ఏమీ వుంచుకోకండి."

"సరేకాని, ఆడబ్బుతో వాళ్ళ ముఖారవిందాలు నాకు కనపడడం మానుకుంటాయా?"

"ఆ, చెపుతాను."

"అంతేకాదు. నువ్వూ వొదుల్చుకోవాలి"

"వాళ్లు వొస్తే నేనేం చెయ్యను?"

"నాకు వొదులు."

"మరి వాళ్ళకి కోపం తెప్పించడం నాకిష్టంలేదు."

"నాకు కోపం తెప్పించడం!"

"ఏమి టా మాటలు? మీకూ వాళ్ళకీ సాపత్య మేమిటి?"

"నాకు లేదులే. నీకూ వాళ్ళకీ సంబంధ మేమిటి?"

"ఏముందీ? ధనం కలవాళ్ళకీ, లేనివాళ్ళకీ వుండే సంబంధం."

"లక్షలున్నారు డబ్బులేనివాళ్ళు. కుంటివాళ్ళు, గుడ్డివాళ్ళు."

"వాళ్ళకిచ్చేది వాళ్ళకి ఇస్తోనే వున్నాంగా. ఇంక మాట్లాడకు" అని ముద్దుపెట్టుకుని వెళ్ళిపోయింది.

ఆమె బాంకి బుక్కులో పది వేలు తరుగు.

పదిరోజులయిందో లేదో మళ్ళీ హాజరు సూర్యనారాయణ. ఈసారి మంచి విలువగల సర్జి సూటులో హాటు. నోట్లో చుట్ట. వొచ్చి చాలా పాతమిత్రుడి మల్లే వాళ్ళిద్దరితోనూ కబుర్లు చెపుతున్నాడు. అతను వెళ్ళాక, ఏమిటి మళ్ళీ వొచ్చాడంటే,

"ఏమిటి మరీ అంత క్రూరంగా మాట్లాడతారు? పాపం ఏదో కొంచెం పెద్దమనిషితో కలిసి బాగుపడదామనే మనిషికి అంతమాత్రం సహాయం చెయ్యకపోతే ఎట్లా? ఎందుకంత కోపం అతనిమీద? ఏం నీచుడా? అల్లరి చేశాడా? మరీ ఎవరినీ చూడకండా స్నేహం చెయ్యకండా మనం ఒంటరిగా బతకాలనా మీ ఇష్టం?" అని ఉపన్యాసం ప్రారంభించింది.

రెండురోజుల కో మాటూ, రోజువిడిచి రోజూ సూర్యనారాయణ వొస్తూనే వున్నాడు. ముందు వాళ్ళని డిన్నరుకి పిలిచాడు బసోటాలో. తాను విస్కీ తాగి, అతన్ని కూడా తాగమని బలవంతంచేశాడు. తాగనంటే హాస్యం చేశాడు. తరవాత వాళ్ళింటోనే అప్పుడప్పుడు భోజనం చేస్తున్నాడు. వీళ్ళిద్దరూ బైలుదేరితే అతను మూడోవాడౌతున్నాడు. క్రమంగా అతని తాగుడు హెచ్చుతోందని తెలుస్తోంది. కాని, ఏ మాత్రమూ ఇతరులకి ఇబ్బంది కలగచెయ్యడు. జాగ్రత్తగా మసులుతాడు.

ఆ సూర్యనారాయణ కంపెనీని ఆమె ఎన్‌జాయ్ చేస్తోంది. తనకెందుకు అతనంత పడడు? అని ప్రశ్నించుకున్నాడు అతను. ఆమెమీద ఏదో కొంత స్వతంత్రమున్నట్టు అతను ప్రవర్తించడం వల్లనేమో! తనకు తెలీని వ్యవహారం ఏదో వుంది.

నెలరోజుల్లో వాళ్ళఇల్లు మామూలు నివాసమయింది సూర్యనారాయణకి. అతనికి ఏమిచెయ్యాలో తెలీలేదు. వాళ్లు మేడమీద చేసే రిహార్సల్సులోకూడా జోక్యం కలగ

చేసుకొంటున్నాడు సూర్యనారాయణ. ఆమె నటించిన చిత్రాలలో లోపాలు చూపి, తన సలహాకింద అవన్నీ సరి దిద్దుతానని చెప్పాడు.

ఓరాత్రి అతను ఆమెతో పెద్ద తగాదా ప్రారంభించాడు.

"మీకంత ఇష్టం లేకపోవడానికి కారణం కనపడదు. పోనీ మీకిష్టంలేదు గనుక ఆయన్ని పొమ్మందామంటే, ఎట్లా పొమ్మనాలో తెలీటంలేదు నాకు."

"మాట్లాడకు నువ్వు అతనితో."

"ఎట్లా, పలకరించే మనిషితో మాట్లాడకపోవడం?"

"నేను పొమ్మంటాను."

"అదేగా, వొద్దనేది నేను."

"సరేలే, అతనట్లా వొస్తోవుంటే, నేనిక్కడ వుండడం కష్టమౌతుంది."

దాంతో ఆమె ఏడ్చింది.

"నేను నీ భార్యని కానుగనక నేకదా, అంత సులభంగా, ఉండను పోతాను, అని అనగలిగావు?" అని.

"నాభార్యావే ఐతే ఇంత వాదన ఎందుకు? నిన్ను వాడిముందే రెండు తన్ని, వాణ్ణి అవతలకి నడపమందును."

"అంతేగా మొగవాళ్ళకి చాతనైన పని. తన్నండి పోనీ, మీకంత సరదాఐతే."

"తన్నను. అంతకన్న మంచిపని. నిన్ను పెళ్ళిచేసుకుంటాను."

"నన్నా? మీకు భార్యవుందిగా"

"వుంటేనేం?"

"నేనంత పాతకానికి వొడికట్టుకోను. పాపం, ఆమె ఏంచేసిందని, నేను ఆమెకి అంత ద్రోహం చేయడం?"

"ఆడవాళ్ళతో ఏ మొగవాడు వాదించగలడు? అంటుకునే తంతాడు."

"ఇప్పుడు నువ్వు చేసే దేమిటి?"

"నేనేం చేశాను? మీ భార్యని రావడానికి వీల్లే దన్నానా? రేపు పిలిపించండి"

"ఈ పరిస్థితుల్లో ఎందుకు వుంటుంది?"

"దానికి నేనేంచెయ్యను?"

"నేనేమన్నా ఆమెరావాలని అన్నానా?"

అంతటితో విసుగెత్తి ఎక్కడ అసలు ప్రారంభించారో అక్కడవిడిచి వూరుకున్నారు.

వాళ్ళకి సూర్యనారాయణ పర్మనెంటు మిత్రుడైనాడని నిశ్చయమయింది. అదిగాక ప్రతిరోజూ అతను ఎక్కువ స్థలం ఆక్రమించుకుంటున్నాడు. ఏం చెయ్యాలి తను? అతను అసలు రాకూడదనిపట్టుపట్టాలి, పడితే ఎటు మొగ్గుతుందో ముల్లు! ఎటువొగ్గనీ ప్రస్తుత స్థితిమాత్రం దుర్భరమనిపించింది అతనికి. భవిష్యత్తుకూడా తన ఉద్వాసనకే మొగ్గుచూపుతోంది. కాని తొందరపడకూడదని సుమతీ శతకం పద్యం చదువుకున్నాడు ఓసారి. కాని—

కదలని వాళ్ళని కాలమే కదలిస్తుంది.

ప్రతి వ్యవహారంలోనూ అతను ఏంచెప్పినా సూర్య నారాయణగారు ఇట్లా అంటున్నారు అని అంటుంది ఆమె. సూర్యనారాయణ సలహా ఎప్పుడూ తన సలహాకి సరిగా వ్యతిరేకం. చివరికి తాను చెప్పిన మార్గాన్నే వెడుతుంది ఆమె. కాని అది తనమీది ఘనతవల్ల కాక సూర్యనారా యణ సలహా అనర్ధదాయకమని ఆమెకి తెలీడంవల్ల నేమో ననిపించింది అతనికి.

ఆ చివరిరాత్రి డ్రాయింగురూములో ఆమే సూర్య నారాయణ చాలా ఉత్సాహంగా కబుర్లు చెప్పుకుని నవ్వు కుంటున్నారు. అరగంటనించి తనని పలకరించలేదు. లేచి పోదామా అనుకుంటూ వుండగా వాళ్ళే లేచారు—

"స్నానంవారి విప్రనారాయణకు వెడదాం" అని.

వాళ్ళిద్దరూ వెళ్ళిపోయినారు. భగ్గుమంది అతని ఆగ్రహం.

రెండునిమిషాల్లో ఆమె వెనక్కి వొచ్చి,

"రారేం ?" అంది.

"ఎక్కడికి ?"

"ఏం విచిత్రం ! వినటంలేదా మీరు !"

"విన్నాను. కాని వొస్తాననలేదే !"

ఈ లోపల బైటనించి అతను 'కుసుమా' అని కేకలు వేస్తున్నాడు.

"అయితే, రారా ?"

"రాను."

